# నిధానంగా ఐదు నిమిషాలు ఆలోచించండి

నా కుమారుడు యేమవుతాడు? నా కుమార్తె భవిష్యత్తు యేమవుతుంది? వారి భవిష్యత్తునకు సంబంధించిన ప్రతి పథకం డబ్బుతో కూడినపని. పెద్ద పెద్ద మొత్తాల్లో డబ్బు కావాల్సి వుంటుంది!

మా మూడు లాభాల - యేక పథకంక్రింద 5 యేండ్ల కాలం మాత్రమే డబ్బు పొదుపు చేశారంటే, మీరు మీ బిడ్డల ఉన్నత విద్యలకు తగిన యేర్పాటు చేయగలరు మరియు వారు తమ జీవితాన్ని చక్కగా ప్రారంభించుటకు కూడా సహాయపడగలరు.

**మూడు-అంచెల పథకం**

1 వ చర్య

**క్యుములేటివ్ డిపాజిట్**

మీ బిడ్డ మొదటి పుట్టినదినమున వాని పేరుమీద ప్రతినెలా రు. 100/- పొదుపు చేయునట్లు 60 నెలల కాలం సిండికేట్ బ్యాంక్‌నందు క్యుములేటివ్ డిపాజిట్ ప్రారంభించండి. మీ బిడ్డకు ఆరు యేండ్లు వయస్సు వచ్చునప్పటికి యీ క్యుములేటివ్ డిపాజిట్ రు. 7791/-కి పెరిగి వుంటుంది.



| క్యుములేటివ్ డిపాజిట్ | | |
|---|---|---|
| నెలకు రు. 100/- వంతున చెల్లించునపుడు | | |
| నిర్ణీత కాలం | చెల్లించిన మొత్తం | ఫలితపు విలువ |
| 12 నెలలు | రు. 1200 | రు. 1250-00 |
| 36 నెలలు | రు. 3600 | రు. 4208-00 |
| 48 నెలలు | రు. 4800 | రు. 5911-00 |
| 60 నెలలు | రు 6000 | రు. 7791-00 |

2 వ చర్య

**ప్రగతి రొఖ్కపు సర్టిఫికేట్**

పై సొమ్మునుండి రు. 7440/- లను సిండికేట్ బ్యాంక్ ప్రగతి రొఖ్కపు సర్టిఫికేట్ క్రింద 120 నెలల కాలమునకు మీ బిడ్డ పేరుమీద తిరిగి పెట్టుబడి పెట్టండి. మీ కుమారునికి/కుమార్తెకు 16 యేండ్ల వయస్సు వచ్చునప్పటికి యీ సర్టిఫికేట్ విలువ రు. 20,000 కాగలదు.



| ప్రగతి రొఖ్కపు సర్టిఫికేట్ | | |
|---|---|---|
| డిపాజిట్ మొత్తం | కాలం | ప్రగతి రొఖ్కపు సర్టిఫికేట్ విలువ |
| రు. 372-00 | 120 నెలలు | రు. 1,000 |
| రు. 7440-00 | 120 నెలలు | రు. 20,000 |
| రు. 610-00 | 60 నెలలు | రు. 1,000 |
| రు. 6100-00 | 60 నెలలు | రు. 10,000 |

3 వ చర్య

**సోషల్ సెక్యూరిటీ డిపాజిట్**

ఈ రు. 20,000 సొమ్మును మీరు మరొకమారు సోషల్ సెక్యూరిటీ డిపాజిట్ క్రింద సిండికేట్ బ్యాంక్‌నందు 60 నెలల కాలం పెట్టుబడి పెట్టవచ్చు. ప్రతినెల వడ్డీ రాబడి క్రింద, మీ బిడ్డలకు రు. 165/- వారి స్వంత ఖర్చులకు వాడుకొనుటకై వస్తూంటుంది. వారికి 21 యేండ్ల వయస్సు రాగానే తమ జీవితాన్ని వారు చక్కగా ప్రారంభించుటకు వీలుగా రు. 20,000 సొమ్ము కూడా సిద్ధంగా వుంటుంది.



| సోషల్ సెక్యూరిటీ డిపాజిట్ | | |
|---|---|---|
| డిపాజిట్ మొత్తం | కాలం | ప్రతినెల రాబడి |
| రు. 5,000 | 60 నెలలు | రు. 41 32 |
| రు. 10,000 | 60 నెలలు | రు. 82 64 |
| రు. 20,000 | 60 నెలలు | రు. 165 28 |

మీరు యే నెలకు ఆ నెల పొదుపు చేసే వారైతే మీకు యీ మూడు అంచెల పథకం లాభకరమైంది. మీరు పెద్ద మొత్తాలలో పొదుపు చేసేవారైతే మీరు 2 వ పద్ధతిగాని 3 వ పద్ధతిగాని యెన్నుకొని విదేశాలకు వెళ్ళాలని, స్వంత బండి వుండాలని, స్వంత యిల్లు వుండాలని మీకు చిరకాలంగా వున్న కోర్కెలను తీర్చుకోవచ్చు.

**ఇది నిజంగా తెలివైన పద్ధతిగదూ?**

5 యేండ్ల కాలం చేయు పొదుపు మీ బిడ్డల భవిష్యత్తుకు అనుకూలంగా యెంతో సహాయం చేస్తుంది.



**సిండికేట్ బ్యాంక్**

ప్రజల క్షేమాన్ని కోరు బ్యాంక్

maa SB 180

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 4-9-'81
దుర్మతి నామ సం. భాద్రపద శు. షష్ఠి
సంపుటము 74 : సంచిక 51
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 67–60
ఆరు మాసాల చందా రు. 33–80
విడి ప్రతి వెల రు. 1–25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003

విషయానుక్రమణిక



ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1981 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము... పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.

## ముగింపు తేదీ 14-9-'81 సోమవారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. 600 ల చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. 600, రు. 500, రు. 400 ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. 250 ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరఠావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.

★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.

★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.

★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలపుతుంది.

★ కథలతోపాటు రచయితల పేర్లు వదవు. బ్యాలట్ తరువాత వారి పరిచయం కోసం వేస్తాము.

★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి.

★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఏట్టి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము.

సం॥

## లోకంపోకడ * డేశిమెన్










# ఉత్తరాలు

## సీరియల్

నటి జయప్రద ముఖచిత్రంతో వెలువడిన 31.7.81 నాటి ఆంధ్రవారపత్రిక చాలా చక్కగ ఉంది. ముఖ్యంగా ఇందులోని దేవుడు చూస్తూనే ఉన్నాడు కథ ముగింపు, కూయనీకాకుల్ని కథ చాలా బాగున్నాయి. చిట్టారెడ్డి సూర్యకుమారి గారి రాగజ్వాల సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా సాగుతోంది.

మహిమ [కుప్పం]

* * *

7.8.81 ముఖచిత్రం నాకు బాగా నచ్చింది. నర్సింగ్‌హోం, రాగజ్వాల సీరియల్స్ రాను రాను మమ్మల్ని బాగా ఆకర్షించుచున్నవి. రచయితలకు నా ధన్యవాదాలు.

అమిరిశెట్టి శ్రీనివాస్ [ జనగాం ]

* * *

జయప్రదముఖచిత్రంతో వెలువడిన 31.7.81 తేదీ పత్రిక చాలా బాగుంది. సీరియల్ దేవుడు చూస్తూనే ఉన్నాడు ముగింపు అసహజంగా ఉందనిపిస్తుంది.

యడ్ల ఆదినారాయణరావు [ పాడేరు ]

* * *

మా అభిమాన పత్రికలో [ సచిత్ర వారపత్రికలో ] నర్సింగ్‌హోం సీరియల్ మంచి ఇంటరెస్టింగా ఉంటోంది.

ఎం. సూరిబాబు, సన్యాశమ్మ, ఉమాప్రకాష్
(ద్రాక్షారామం)

* * *

దేవుడు చూస్తూనే ఉన్నాడు సీరియల్ కథ చాలా బాగుంది. అన్యాయాలకు ఎప్పుడో ఒకప్పుడు అంతం తప్పకుండా ఉంటుందని నిరూపించారు. కాని ఈ లోకంలో జరిగే అన్యాయాలకు, అక్రమాలకు అంతం ఎప్పుడో? నర్సింగ్‌హోం చదువుతుంటే నకిలీ డాక్టర్ల గుట్టు బయటపడుతోంది.

గెడ్డం శారద ( విశాఖపట్టణం)

(64 వ పేజీ చూడండి)

పై వారమే!

వినాయకచవితి సంచిక

OBM/1765 TEL

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు



కేర్‌ఫ్రీ మిమల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునికయువతికి చేదోడు.

కేర్‌ఫ్రీ ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్. ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, కేర్‌ఫ్రీ ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు, కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క కేర్‌ఫ్రీ మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది, ఇది మరకల పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

కేర్‌ఫ్రీ తో మీరు హాయియైన భావన పొందగలరు నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉలికి ఆరవేసే ఇబ్బందిలేదు.

కేర్‌ఫ్రీ వాడకానికి తయారుగా వుంటుంది, మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అది ఆరోగ్యకరమైనదిగూడా.

కేర్‌ఫ్రీ ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిస్తుంది.

Johnson & Johnson

# సూపర్ రిన్ తో
# తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్ తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటె మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే
ఋజువు చేసుకోండి:

మరే ఇతర డిటర్జంట్-బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో

**సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన




"సిద్ధాంతిగోరూ ?!"

ఇంటి బయట నుంచి వినిపిస్తున్న పిలుపుకు ఎవరూ అంటూ బయటికొచ్చి చూసేడు సిద్ధాంతి ఎదురుగా చిరునవ్వు నవ్వుతూ బైరాగి

"నమస్కారవండీ పంతులుగోరూ!"

"నమస్కారం...నమస్కారం... ఏవిటిలా పొద్దునే దిగబడ్డావు?" పలకరింపుగా అంటూ లోపలికి నడిచేడు సిద్ధాంతి.

అతని వెనకనే లోపలికొచ్చేడు బైరాగి.

"కూర్చో!..." బైరాగి కూచోడానికి చిన్న స్టూలు చూపించి, తను మంచంమీద కూర్చున్నాడు సిద్ధాంతి

సిద్ధాంతికి దాదాపుగా యాభై సంవత్సరాల వయస్సుంటుంది లంబుగా, పట్టె నామాలతో నిగనిగలాడుతూంటాడు. ఉద్యోగమంటూ ఏమీ లేదు. సిద్ధాంతి తాత నీలకంఠంగారూ, తండ్రి సర్వేశ్వరశాస్త్రి గారూ ఆ మాత్రం, ఈ మాత్రం సంపాదించడంతో కాలుమీద కాలువేసుకుని తిన్నా గడిచిపోతుంది. అయినా అది సిద్ధాంతి కెంత మాత్రమూ యిష్టంలేదు. వాళ్ళు సంపాదించిన ఆస్తి పాడుచేయడం కన్నా, దానికి మరికొంత జోడించి తన తదనంతరం తన సంతానానికి యివ్వడం మంచిదన్న పారమార్థిక సూత్రాన్ని బాగా అమలులో పెట్టదలచుకున్నాడు సిద్ధాంతి.

తాతగారు నీలకంఠంగారూ, తండ్రి సర్వేశ్వరశాస్త్రిగారూ, వేదంలో పండితులు. ఆచారాల్లో ఉప్పుడు పిండాలు. అన్నింటికన్నా ముఖ్యం, వాళ్ళ పంచాంగంచూసి ఏదేని శుభకార్యానికి ముహూర్తం నిర్ణయించేరూ అంటే అక్షరాలా, అన్ని విధాలా లాభదాయకంగా వుండేది. తాతగారి నుంచి కొంత, తండ్రి నుంచి కొంత నేర్చుకుని తన జీవితాన్ని ముహూర్తాలు పెట్టడం, పడికట్లు చూడటంలో కేంద్రీకరించి రెండు చేతులో ట్టి సంపాదిస్తూనే వున్నాడు.

సిద్ధాంతి భార్య కామాక్షి. భర్తకు అన్నివిధాలా తగిన భార్య సిద్ధాంతికో కొడుకు. ఆ కొడుక్కి తాతపేరూ, తండ్రి పేరూ కలిసివచ్చేలా నీలకంఠ సర్వేశ్వరశాస్త్రి అని పేరు పెట్టుకున్నాడు. పూర్తి పేరు ...డం క్రమంగా అనుకుని 'శాస్త్రి' అని 'పేరుతో కొడుకుని చెలామణిలో పెట్టాడనే చెప్పాలి.

బైరాగి సిద్ధాంతి వేపూ, అతని చేతిలోని పంచాంగం వేపూ చూసి చిర్నవ్వు నవ్వేడు.

"ఏవిటి చెప్పవోయ్! బైరాగీ? ఏవిటి విశేషం?"

"అబ్బే!... ఏంలేదు పంతులుగోరూ, మూర్తాలు వచ్చేత్తన్నాయి గదా? మా పిల్లదానికి పెళ్లి సేసీయ్యాలని సూత్తన్నాను. సంబంధవూ కుదిరింది."

బైరాగి చదువుకున్నవాడు కాదు. అలాగని అతనికదోలోటు అని అనుకుంటే పొరపాటే. అవకాశం రాలేదుగాని, అదృష్టం పెట్టుక్కొని వత్తుంది అన్న నమ్మకం గలవాడు. సిద్ధాంతికి బైరాగి మీద, బైరాగికి సిద్ధాంతి మీద విపరీతమైన అభిమానమూ, నమ్మకమూనూ.

"అమ్మాయి పేరేవిటనావు?" పంచాంగంలోకి చూస్తూ అన్నాడు సిద్ధాంతి.

"లచ్చిమండి"

"అల్లుడు పేరో?"

"నారాయణ రావండి."

# ఆదర్శం

పంచాంగంలో బాగా తల దూర్చి ఓ పది నిముషాలు కూడికలూ గుణింతాలూ చేసేక "వచ్చేనెల రెండో తారీకు ఆదివారం రాత్రి పదిగంటలకి పెళ్ళి ముహూర్తం బ్రహ్మాండంగా వుంది బైరాగీ! ఈ ముహూర్తం మహాబలమైనది. దంపతులు నూరేళ్ళు అన్యోన్యంగా బ్రతకడం ఖాయం" అన్నాడు.

ఆరోతరగతి చదువుతున్న విద్యార్థిలా తలవూపేసి సిద్ధాంతి వ్రాసిచ్చిన ముహూర్తం కాగితాన్ని చొక్కాజేబులో పెట్టుకొన్నాడు బైరాగి.

"ఇంతకీ, కట్నం కానుకలూ ఏవీ చెప్పనే లేదు. నాకు కూడా చెప్పకూడదుటయ్యా?"

చటాలున అడిగేడు సిద్ధాంతి.

"ఏవుందండీ? అబ్బాయి నారాయణరావుకి పదేలు ఇత్తన్నానండి. అతను యిసాకపట్నంలో ఓడలు కట్టే పనిలోనుంటాడండి. యిసాకపట్నంలో పనంటే మాటలా?"

అల్లుడికి పదివేల రూపాయలు కట్నం క్రింద పోస్తున్నానన్న విషయాన్ని అప్రస్తుతంగా వదిలేసి విశాఖపట్నంలో పనిచేస్తున్న విషయం చాలా గొప్పగా భావిస్తూ ఒప్పుకున్నాడు బైరాగి.

సిద్ధాంతి ముఖంలో చిర్నవ్వు కార్తీక మాసం ప్రమిద వత్తిలా వెలిగింది.

"చూడు బైరాగీ! అంత కట్నం పోసి అమ్మాయికి వివాహ శుభకార్యాన్ని జరుపుతున్నావు కదా! చుట్టాలకీ, పక్కాలకీ, తెలిసినవాళ్ళకీ భోజనాలూ, తాంబూలాలూ కానుకలూ వగైరాలు? వున్నాయా? లేదా?"

బైరాగి బదులేమీ చెప్పనేలేదు. ఆ విషయమై ఏమీ నిర్ణయించలేనట్లుగా వుందతని ముఖం. సిద్ధాంతిలో ధైర్యం వచ్చింది.

"ఇదిగో బైరాగీ... అంత డబ్బుపోసి కూతురు పెళ్ళి ఘనంగా జరుపుకుంటున్నావు నీకో విషయం చెబుతాను విను ముందు. మన వాళ్ళే అనుకున్నవాళ్ళు అంతా మంచివాళ్ళే వుండరు. వాళ్ళలో కొందరు అసూయా పరులూ వుంటారు. వాళ్ళ కళ్ళు అంత మంచివి కావనే చెప్పాలి. ఏవడో ఒకడు నిన్ను చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు. అటువంటివేమీ జరక్కుండా ఘనంగా విందు భోజనాలూ, శాంతి, దానాలూ వగైరాలు

తప్పక జరిపించాలి లేకపోతే... నా నోటితో చెప కూడదుగాని, నీ కూతురి కాపురం సుఖంగా జరగదయ్యా!!''

సిద్ధాంతి చెప్పిన విషయాల్లో కొట్టేయ వలసినవి ఏవీ లేవనిపించింది బైరాగికి.

''సిద్ధాంతిగోరు సెప్పిందే నిజమే అయ్యుండాలి. ఒకవేళ అలా జరిపించకపోతే కూతురి కాపరం పాడైపోదూ???''

ఆ విషయం తెల్సుకోగానే ఒళ్ళు జలదరించింది బైరాగికి. తప్పక అన్నీ జరిపిస్తానన్నట్టుగా బుఱ్ఱ ఊపి, సిద్ధాంతి చేతిలో పది రూపాయలుంచి కదిలేడు బైరాగి.

''పొద్దునే పదిరూపాయలు ఆదాయం. ఇంతకీ ఆ బైరాగి కూతురి పెళ్లి ముహూర్తం అంత బావుందా ?'' కామాక్షి ప్రశ్నించింది.

ఫక్కున నవ్వేడు సిద్ధాంతి. అతనలా నవ్వుతుంటే ముందు విరిగినపన్ను తొర్ఱ స్పష్టంగా కనిపిస్తోంది.

''ముహూర్తాలు నిర్ణయించి పెట్టేవరకేనే ఇవన్నీ. ఆ తరువాత వాళ్లెలా అఘోరిస్తారో మనం ఆలోచించకూడదు. విందుభోజనాలూ, దానాలూ యివ్వాలని చెప్పేమూ అంటే, పెట్టిన ముహూర్తాన్ని గట్టిగా సమర్థించు కుందుకేసుమా!! ఏదో మామూలుగా చెప్పేయడండీ ముహూర్తం అంటే వాళ్ళకి మనమీదా బలంగా నమ్మకం కలగొద్దూ ?!...అయినా, ఇవన్నీనీకెందుగ్గాని అబ్బాయి శాస్త్రి లేచేడా ?''

''ఆ! ఆ! వాడిందాకల్నే లేచి అలా వీధిలోని వసారాలో కూచున్నాడు. ఆబైరాగితో మీరు మాట్లాడుతుంటే వాడెందుకూ మధ్య ?''

సహజంగా వున్న దీర్ఘంతో మరింత సాగదీసింది కామాక్షి మాటని.

బయట ఎండ క్రమంగా పెరుగుతోంది. వీధిగది కిటికీదగ్గర మడతకుర్చీ వేసుక్కూర్చున్నాడు సిద్ధాంతి

బయటనుంచి లోపలికి వచ్చాడు శాస్త్రి.

''ఇలా కూచోరా శాస్త్రీ ! నీతో మాట్లాడాలి'' దగ్గరేవున్న బల్ల చూపించాడు సిద్ధాంతి.

''నిన్ననో సంబంధం వచ్చింది. పిల్ల సలక్షణంగా వుందిట. మాంచి సాంప్రదాయం, చదువూ, ప్రతిష్ఠగల యింటిబిడ్డ. నువ్వు ఊఁ అంటే సంబంధం ఖాయపర్చేస్తాను.''

శాస్త్రి తలవంచుకుని వింటున్న వాడల్లా తలెత్తి తండ్రివేపు చూసేడు — బయట ఎండలో మార్పు కనిపిస్తోంది క్రమక్రమంగా.

''ప్రస్తుతం నాకు పెళ్లి చేసుకోవాలని లేదు.''

''ఏం ?''

''ఏం ? అంటే ఏమీచెప్పలేను. పెళ్ళంటే నాకు ఖచ్చితమైన అభిప్రాయాలు వున్నాయి. నేను చేసుకునే అమ్మాయి విషయంలో కూడ నాకు కొన్ని అభిప్రాయాలున్నాయి.''

దృఢ విశ్వాసంతో అంటున్న శాస్త్రి వేపు చూసి విసుగ్గా నిట్టూర్చాడు.

తను కళ్ళముందే ఎంతో పెద్దవాడయి పోయాడనిపించింది. ఈ కాలంలో కుర్రోళ్ళే యింత-వాళ్లెంతలిస్తే అంత పెద్దవాళ్ళన్న కనీసమర్యాదలూ లేవు

చివరికి నోరు విప్పేడు సిద్ధాంతి. ''చూడూ! శాస్త్రీ ! నీకు 'పెళ్లి' విషయంలో ఎలాటి అభిప్రాయాలున్నాయో మాకు తెలియ చేయందే మాకు ఎలా తెలుస్తుంది? అయినా మేమేం నీకు సరైన సంబంధమే తీసుకొస్తాం గాని, బొత్తిగా ఏ నేథవముండనో తెస్తామ్మటా ?!''

శాస్త్రి తండ్రితో వాదించదలుచుకోలేదు. అయినా తన మనస్సుని తండ్రిముందు పరచాలని భావించాడు.

''నాకు అన్నివిధాలుగా నచ్చినదే, నేను మెచ్చినదే నేనే ఎంచుకుంటాను. మీకు ఈ విషయంలో శ్రమ యివ్వదల్చుకోలేదు.'' అన్నాడు శాస్త్రి.

''పోనీ ఈ రాజమండ్రం అమ్మాయిని ఓసారి చూడకూడదన్నటా! ఇందులో మునిసామ్మేం పోయిందీ?'' రాగం తీసింది కామాక్షి చిన్న సందు చూసుకుని.

''ఎందుకి పెళ్లి చూపులూ? తతంగా లున్నూ? నా కిటువంటివేమీ నచ్చవు. నేను ఇప్పుడిప్పుడే పెళ్లి చేసుకోనని వాళ్ళకి కబురు చేసెయ్యండి.''

దిగ్గునలేచి కదిలేడు శాస్త్రి.

రెండు భిన్న ధృవాలు కలవ్వు. ఒకవేళ కలిసే పిడుగులుపడి ప్రకృతే మారిపోతుంది. అలాగే రెండు భిన్నమైన వ్యక్తిత్వాంగలవాళ్ళు, వాళ్లెలాటి బంధుత్వం గలవాళ్లైనా ఏకాభిప్రాయాన్ని కలిగుండరు ఆ కోవలోని వాళ్లే సిద్ధాంతి, శాస్త్రీనూ. ''పెద్ద విగలాగ, దూడ దిగలాగ'' అన్నట్టుగా వుంటుంది పరిస్థితి.

* * *

బైరాగి తన కూతురి పెళ్లి అట్టహాసంగా ఆడంబరానికి, భూమికి సాధ్యమున్న ఖాళీ జాగా అంతా నిండేటట్టు పందిరేసి చేసేడు. ఒక్కగా నొక్క కూతురు పెళ్లికి ఏ ఒక్క బంధువూ, మిత్రుడూ, కావలసినవాడి దృష్టి చెడుగా ప్రసరించకూడదనే సిద్ధాంతి సలహాతో అందరికీ సంతృప్తిగా విందులూ చేసేడు. గుప్పెడు నిండా అక్షింతల్ని పట్టుకుని 'దీర్ఘసుమంగళీభవ, శతాయుష్మ' అంటూ దీవించేసేరు వాళ్ళు.

బైరాగి ఓ నూరు రూపాయలూ, పంచా, చొక్కా, కలిపి సిద్ధాంతికి చదివించి కాళ్ళకు పడి, పడి దండం పెట్టుకున్నాడు.

''సిద్ధాంతిగోరూ! మీ చేతులో...టి



# ఆదర్శం

పిల్చేరి ముహూర్తం సల్పగ నూరేళ్ళు, పిల్ల పావలో బతకాలని దీవించండి బాబూ !!'' బైరాగి ఆప్యాయతకు మురిసిపోతూ ఆ జంటను మనసారా దీవించి కదిలేడు సిద్ధాంతి.

ఆరు నెలలు కాలగర్భంలో గడిచాయి. అన్యోన్యంగా జీవించే బతుకులో నివ్వులు కురియడానికీ, వాళ్ళ జీవితాలతో చెలగాటా లాడ్డానికీ ఆర్నెల్లు చాలు.

అట్టహాసంగా ఆకాశమంత పందిరి కింద పెళ్ళిచేసుకుని, గుండెల్నిండా భవిష్యత్తుమీద ఆశల్ని నింపుకుని వెళ్ళిన బైరాగి కూతురు ఆర్నెల్లయేసరికి విధవై తిరిగి వచ్చేసింది. ఆమె నూరు సంవత్సరాలజీవితం ఆర్నెల్లుతో తూరిపోయింది.

ఆమె భర్తృహీన అయినప్పుడు బైరాగి గుండెలు పగిలిపోయాయి. పదేసి గజాలకో అడుగువేస్తున అంగలు వేస్తూ సిద్ధాంతి ముందు వాలేడు భోరున ఏడుస్తూ.

“ఏటిది సిద్ధాంతి బాబూ? దాని కరమ ఏందుకిట్టా కాలింది? అదేం పాపం జేసింది? దాని బతుకులో ఏ అగ్గిరవ్వ పడింది? ఏ దుర్ముహూర్తం దాని పసుపూ కుంకాల్ని తుడిసే సింది?' గుండెలు కొట్టుకుని ఏడుస్తూ గుమ్మంలో చతికిల పడిపోయాడు బైరాగి.

సిద్ధాంతి అవాక్కయిపోయాడు. కామాక్షికి నోటమాట రాలేదు. “తనకు తెలిసినంత వరకూ ఏ దోషమూ లేదు ముహూర్తంలో. ఆమె జాతకంలో కూడా వైధవ్యం కనిపించ లేదు. చెప్పాలంటే పైగా ఆమె పసుపూ కుంకుమతో చాలాకాలం బతుకుతుందనే గ్యారంటీగా చెప్పగలడు. మరెందుకిలా జరిగింది?'' తనలో తనే ప్రశ్నించుకున్నాడు సిద్ధాంతి.

సమాధానం అంత వేగంగా దొరకదు. ముహూర్తబలంమీద మంచి నమ్మకం వున్న సిద్ధాంతి తాను పెట్టిన ముహూర్తాన్ని మళ్ళా పరీక్షించుకున్నాడు. దోషం లేదెక్కడామా. దోషమల్లా విధిదే అయివుంటుందని మనస్సులో తలపోసేడు.

“బైరాగీ! నా వృత్తిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను. ముహూర్తంలో ఏ దోషమూ లేదంటే నమ్ము. ఎంతో మందికి పెళ్ళిలగ్నాలు నిర్ణయించేసేను. నా లెక్కలో తప్పు దొర్లడానికి లేదు. ఏందుచేత ఇలా జరిగిందో అర్థం కావడంలేదు. నాకు తెలిసిం దల్లా ఒక్కటే! మనం ఏన్ని భావించి, ఏలా చసినా ఆ విధి నిర్ణయం ప్రకారం జరగాల్సిందేనయ్యా!'

కాసిన్ని వేదాంతపు అమృతగుళికలు బైరాగి తడి గొంతులో వేసి ఓదార్చాలని చూసేడు సిద్ధాంతి.

నమ్మకం వమ్ముచేస్తూ మనిషి గుండెల్ని పిండివేసే విషాద సంఘటన జరిగితే? ఆ మనిషి నాస్తికుడన్నా అవుతాడు, పిచ్చి వాడన్నా అవుతాడు. అయితే బైరాగి రెండూ కాలేదు. కాని, గ్రహణంపట్టిన సూర్యునిలా ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుంటూ సిద్ధాంతి ఇంటి మెట్లు దిగేడు. మూర్తీభవించిన విచార వదనుడైన ఆ బైరాగిని చూస్తూ గర్తిగా నిట్టూర్చాడు సిద్ధాంతి. బయటనించుని అంతవరకూ సిద్ధాంతి మాటల్ని, బైరాగి ఆవేదననీ వింటూ నిశ్చేష్టుడైపోయిన శాస్త్రి మనస్సు నిశ్శబ్దంగా రోదించింది. మౌనంగా లోపలికి అడుగులువేసేడు.

## లోయలో కోయిల

కవితావేశంతో పొంగే నా హృదయం
ఒక చలనోచ్ఛల ఊయల —
ప్రశాంత ప్రకృతిలో మౌనబోధచేసే
కొండమీది కోవెల —
అనుభూతులు పూతలు పూసే
అలల మీది సిరివెన్నెల
జడజగత్తును సమ్మోహనంచేసే
చిగురాకు లోయలో కోయిల!

— కలికిరి వి. అబ్దుల్ ఖాదర్

“ఇంతకీ ఏంచేసావురా శాస్త్రీ?''లోపలకు వచ్చిన కొడుకుని ఏవీజరగనట్టుగా అడుగు తున్నాడు సిద్ధాంతి. తండ్రి వేసిన ప్రశ్నకు శాస్త్రి గుండెలు కుత కుత లాడేయి. తమాయించుకున్నాడు

“ఏవీ ఆలోచించుకోలేదింతవరకూ.''

“అదేం? ఏ విషయమూ చెప్పమని చాలకాలంక్రిందటే చెప్పేను నీకు మనమీద నమ్మకం పెట్టుకుని వాళ్లు ఆ అమ్మాయికి ఏ సంబంధమూ చూడటంలేదట.'' శాస్త్రి ఏవంటాడోనని చూసేడు సిద్ధాంతి.

“అంటే? నాకిప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదని వాళ్ళకు కబురు చేయలేదా మీరు?'' అన్నాడు శాస్త్రి

లేదన్నాడు సిద్ధాంతి.

“అవును. మీరెందుకు తెలియపరుస్తారు? మీ స్వార్థంకోసం ఎదుటివాళ్ళ అమాయ కత్వంతో ఆటలాడుకోవడం మీకు తెలుసు. ముహూర్తాలూ, పడికట్లూ, విందు భోజనాలూ, మీకు భారీగా దానాలూ, కానుకలూ అనిచెప్పి, పాపం, ఆ బైరాగిని పీల్చి పిప్పిచేసేరు. తన కూతురు సుఖాన్ని ఆశించి, మీరెంచెబితే అది చేసేడతను. ఇప్పుడేం జరిగింది??

కడుపునిండా తిని, ఏవేవో నాలుగు దీవించిన ఈ పెద్దలు ఇప్పుడామె జీవితాన్ని బాగుచేయగలరా? తుడిచిపెట్టుకు పోయిన ఆమె మాంగల్యాన్ని తేగలరా? కనుదృష్టి అనీ, శుభముహూర్తం అనీ, అమాయకుల మనస్సులో లేనిపోని పిరికి భావాల్ని బలవం తంగా రుద్దే మీవంటి వాళ్ళు ఆ తండ్రి మనస్సును యిప్పుడు ఏఏ సెంటిమెంట్సుతో చల్లబరుస్తారో చెప్పండి? సలహాలను యివ్వడమే కాదండీ! అవి ఎంతగా,ఏ విధంగా వాళ్ళ జీవితాలో పనిచేసా యో ఆలోచించాలి.''

సుడిగాలిలా నాలుగు మాటల్ని దబదబా దులిపి విసురుగా బయటకు వెళ్ళిపోయాడు శాస్త్రి.

సిద్ధాంతి ముఖం వివర్ణమైంది. తనుకన్న కొడుకు, తన తాతకీ, తన తండ్రికీ వారసు డౌతాడనుకున్న శాస్త్రి యిలా చడమడా లాడేసరికి తడబడిపోయాడు పాపం!

ఆ రాత్రి శాస్త్రి యిల్లు చేరనేలేదు.

* * *

తెల్లారేసరికి యింటికి వచ్చేసిన అతిథుల్ని చూసేసరికి కంగారుపడిపోయారు సిద్ధాంతి, కామాక్షీనూ.

హడావుడిగా వాళ్ళను గదిలో కూర్చోపెట్టి కామాక్షిని లోపలికి పిలిచేడు.

“వాళ్ళు రాజమండ్రి వాళ్ళు. ఓసారి శాస్త్రిని చూసిపోదామని వచ్చారు. వాడు రాగాన్నే కస్సుబుస్సు లాడవద్దని చెప్పు'' అన్నాడు.

కామాక్షి అలాగేనంటూ తల వూపింది.

ఆ మాటలూ, ఈ మాటలూ జరిగేయి తరాలనుంచీ వున్న బీరకాయపీచు సంబంధాల వెలికి వచ్చాయి. శాస్త్రి కోసం అంతా ఎదురుచూస్తున్నారు!

# ఆదర్శం

అప్పటికి పది దాటింది. శాస్త్రి జాడ లేదు. కాలుగాలిన పిల్లిలా బయటికీ, యింట్లోకీ తిరగసాగేడు సిద్ధాంతి.

పదకొండు దాటింది. ఇంకా శాస్త్రి జాడలేదు.

శాస్త్రి ఓకే అంటే ఈ సంబంధాన్ని ఖాయం చేద్దామని చూస్తున్నాడు సిద్ధాంతి. అమ్మాయిని యింతకు మునుపే చూసి, నచ్చిందని శాస్త్రికి చెప్పేయడం కూడా జరిగింది.

మరో పదినిముషాలు భారంగా గడిచేయి. దూరంగా వాకిట్లో ప్రత్యక్షమయ్యాడు శాస్త్రి, మెళ్లో దండతో. ప్రక్కనే నడిచొస్తున్న బంగారపు బొమ్మతోయింట్లోకి అడుగేస్తూ వచ్చాడు.

సిద్ధాంతీ, కామాక్షీ, వచ్చిన బంధువులూ అందరూ రెప్ప వేయకుండా చూస్తుండిపోయారు.

శాస్త్రి ముఖంలో గంభీరత కనిపిస్తోంది. తిన్నగా తండ్రి దగ్గరికి వచ్చేడు.

"మమ్మల్ని ఆశీర్వదించండి నాన్నా! మీ అనుమతి లేకుండగా రిజిష్ట్రారు ఆఫీసులో పెళ్ళి జరిగిపోయింది. ఈమె మీ కోడలు విజయ..."

చెప్పి భార్యతోకలిసి సిద్ధాంతి పాదాలకు నమస్కరించడానికి వంగేడు జంటగా.

చటుక్కున పాదాల్ని వెనక్కు లాక్కున్నాడు సిద్ధాంతి అతన్లో కోపాగ్ని రగుల్తోంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. గుండెల్లో మంటలు రేగుతున్నాయి.

"పో యిక్కణ్ణుంచి. నా ఆశల్ని నాపరువునీ విలువునా మంటగలిపి, మళ్ళీ నన్ను ఆశీర్వదించమని సిగ్గు లేకుండావచ్చావా? అందుకేనా వాకిప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదని చెప్పేవు?"

తండ్రి కేకలకు శాస్త్రి తొందరపడలేదు. నిదానంగా తండ్రి ముఖంలోకి చూసేడు.

"చూడండినాన్నా! మీరు మీ సిద్ధాంతాలకీ, మీ నమ్మకాలకీ విలా అయితే ప్రాణాల్ని సైతం ధారబోస్తారో, నేనూ అలాగే, నా ఆశయాలకీ, ఆచరణలకీ ప్రాణంధారపోస్తాను. మీరు చూపించే ఈ సంబంధంతో నేనో పాతికవేలకి అమ్ముడుపోయి, మనసును చంపుకుని వ్యక్తిత్వం లేకుండా బతకాలా?...లేదు —అలా వీల్లేదు.

ఈమె ఎవరోగాదు. ఎంతో నమ్మకంతో మీ దగ్గర ముహూర్తాన్ని వేయించి, మీ స్వార్థపు మాటలకు లొంగి, వేలకు వేల రూపాయలు ఖర్చుచేసి విందులూ, వినోదాలతో మహాఘనంగా కూతురి పెళ్లి చేసిన బైరాగి ఒక్కగానొక్క కూతురు విజయలక్ష్మి. ఆర్నెల్లు తిరక్కుండానే భర్తనుపోగొట్టుకున్న అభాగ్యురాలు."

"ఆ...!" అన్నారు సిద్ధాంతితో కలిసి అందరూ.

"అవును. ఈమెనే నేను ఈ రోజు రిజిష్ట్రారు ఆఫీసులో వివాహం చేసుకున్నాను. మా వివాహానికి ఖర్చు ఎంతో తెలుసాండీ?... ఈ మెడలోని దండలతో కలిపి కేవలం పది రూపాయలు.

మా పెళ్ళికి బాజాలు, భజంత్రీలు లేవు సన్నాయి వాద్యాలు అసలే లేవు. విందులూ, వినోదాల పేరుతో అనవసర ఖర్చులు అసలే లేవు. ఆ ఖర్చుతో చెయ్యాలనుకుంటే ఓ వెయ్యి మంది దరిద్రులకి ఓ పూట కడుపు నిండా భోజనం పెట్టొచ్చు.

ఓ ప్రక్క దేశంలో ధరలూ, జనాభా పెరిగిపోతోంటే... పట్టెడు మెతుకులకోసం దరిద్రులు అల్లాడుతోంటే, ఈ వృధా అలవాట్లూ, వృధా ఆచారాలపేరిట డబ్బునీ, శ్రమనీ, కాలాన్నీ వ్యర్థం చేయడం ఏం బాగుంటుంది?

అందుకే నేనీపని చేసేను. ఈసమాజంలో ఏమీ ఆధారంలేని ఓ అభాగ్యురాలి బతుక్కి అర్థం కల్పించానన్న ఆత్మస్థైర్యం నాకుంది... మమ్మల్ని మనసారా దీవించండి..."

అప్పుడు ప్రవర్తమానమౌతున్న సూర్యుణ్ణి శాస్త్రి ముఖంలో చూసేరంతా...!

## లెక్కా - పక్కా!

కోర్కు కెక్కితే
బతుకు ఒక రెక్క
వాలినచో లెక్క;
విన్నికల్లో దిగితే
మనిషికి పిచ్చెక్క
నష్టం పక్కా!

— యస్. యస్ రెడ్డి

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కాంగ్రెస్ ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# బలహీన వర్గాలకు చేయూత



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధాన మంత్రి)

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ 20 సూత్రాల ఆర్థికకార్యక్రమాన్ని అమలు జరపడంతో ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా ఉంది. ఈ కార్యక్రమంలో భాగంగా బలహీనవర్గాల సంక్షేమానికి ఇటీవలి సంవత్సరాలలో అమోఘమైన పథకాలెన్నింటినో అమలు జరుపుతున్నారు.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

## సంక్షేమ కార్యక్రమాలలోని కొన్ని ముఖ్యాంశాలు :

★ మిగులు భూముల పంపిణీ : 74,062 మంది షెడ్యూలు కులాలవారికి 1.05 లక్షల ఎకరాలు. 24,371 మంది షెడ్యూలు తరగతులవారికి 39.9 వేల ఎకరాలు. 40,871 మంది వెనుకబడిన తరగతులవారికి 58.7 వేల ఎకరాలు.

★ ప్రభుత్వ భూముల పంపిణీ : 4,63,672 మంది బలహీనవర్గాల ప్రజలకు 8.11 లక్షల ఎకరాలు.

★ 12 లక్షలమంది పేదలకు ఇళ్ళస్థలాల పంపిణీ, వారిలో చాలా మంది బలహీన వర్గాల వారికి చెందినవారు ఉన్నారు.

★ 12,701 మందిని వెట్టి చాకిరినుంచి విముక్తి కలిగించారు. ఇంతవరకు 5,800 మందికి పునరావాసం కల్పించారు.

★ వ్యవసాయ కూలీలకు కనీస వేతనాల అమలు : వారిలో చాలామంది వెనుకబడిన తరగతులవారు ఉన్నారు.

★ ప్రభుత్వ ఉద్యోగాలలో నియామకానికి వెనుకబడిన తరగతులవారికి ఇచ్చే రిజర్వేషన్లను మరో 10 సంవత్సరాలకు పొడిగించారు.

★ వర్ణాంతర వివాహాలు చేసుకునేవారికి ప్రోత్సాహం కల్పిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఈనాడు బడుగువర్గాలవారు ఎంతో ఉత్సాహంతో ముందడుగువేస్తూ ఉజ్జ్వల భవిష్యత్తువైపు పయనిస్తున్నారు.

డైరెక్టరు, సమాచార పౌర సంబంధశాఖచే ప్రకటితము.

DIPR No. 39701/Advt/C1-3/81

# నాణానికి మరోవేపు

భానుమూర్తి



రైల్వే డివిజనల్ ఆఫీసులో అనుకున్న పని కాలేదు. అప్పటికే రెండు గంటలయింది. ఎండ విపరీతంగా వుంది. బస్సు కోసం వెయిట్ చేసే ఓపిక లేదు. అదీగాక నేను ఇంటికి త్వరగా వెళ్ళాల్సిన అవసరం కూడా వుంది. ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ, ఆటోనిపిలిచి ఎక్కి కూర్చున్నాను. సిగ్నల్ దాటాక నా పర్మిషన్ తీసుకుంటూ, ఇంకో పాసెంజర్ని ఎక్కించుకున్నాడు ఆటో అతను. ఆటో టాంక్‌బండ్ దాటుతోంది. నా కాలి క్రింద ఏదో వస్తువు వున్నట్టుగా అనిపించి, కాలు ప్రక్కకు జరిపి చూశాను. అది పర్స్‌లాగ వుంది. ఎవరిదో? ఇంతకు ముందు ఆటో ఎక్కిన వాళ్ళు మరచిపోయి వెళ్ళారేమో? దాన్ని చేతిలోకి తీసుకుందామనుకున్నాను. ప్రక్కతను చూస్తాడేమో! అతను ఆటో నుండి బయటకు చూస్తున్నప్పుడు, మెల్లగా కాలి క్రింద పర్స్‌ను చేతిలోకి తీసుకున్నాను పర్స్ చాలా కాస్ట్లీగా వుంది. బరువుగా కూడా తోచింది. దాంట్లో డబ్బు బాగా వుండి వున్నట్లుంది అనుకున్నాను. అది ఆటోడ్రైవర్‌కు యిచ్చివేస్తే! ఎందుకు? అనిపించింది. వెంటనే ప్రక్కతను చూడకుండా జేబులోకి నెట్టేశాను. పాపం ఎవరు పోగొట్టుకున్నారో! అనుకుంటూండగానే విజయనగర్ కాలనీ వచ్చేసింది. ఆటో అతనికి డబ్బులిచ్చేసి క్రిందకు దిగాను. జేబులో వున్న పర్స్‌లో ఏముందో! ఎంత డబ్బుందో అన్న ఆత్రుత ఎక్కువయింది నాలో. అక్కడ ప్రక్కనే వున్న హోటల్లోకి దూరి ఓమూలగా కూర్చున్నాను సర్వర్‌కు కాఫీ ఆర్డరిచ్చాను. మెల్లగా జేబునుండి పర్స్‌తీసిచూశాను ఇంతా చేస్తే అందులో ఏమీలేదు. ఏవో రశీదులకట్ట మాత్రం వుంది. పర్స్‌మీద యజమాని అడ్రెస్ వుంది. ఆశ్చర్యం – అతనుండేది శాంతినగర్ లోనే! అడ్రెస్ మూలంగా అతను డివిజనల్ ఆఫీసులోనే పని చేస్తున్నట్లు తెలిసింది. ఒక పని గురించి నెలరోజుల నుండి డివిజనల్ ఆఫీస్ చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నాను కాని నా పని కావటంలేదు ఇప్పుడు ఈ పర్స్ సొంతదారుడు నాకు కావల్సిన సెక్షన్‌లోనే వున్నాడు. ముఖ్యమైన స్థానంలో వున్నాడు కూడ. అతనివల్ల నా పని అవుతుంది ఇలా తనకు ఈ పర్స్ దొరికిందని చెబుతూ అది అతనికి వప్పగించి, అలాగే నా పరిచయం కూడ చేసుకుంటే... ఇది చూస్తుంటే నాకు అయిదేళ్ళ క్రితం జరిగిన ఓ సంఘటన గుర్తొచ్చింది.. ఆరోజు నేను హైదరాబాద్‌నుండి మద్రాస్ వెళుతున్నాను. అక్కడ ఓ కంపెనీలో సేల్స్ రిప్రెజెంటేటివ్ జాబ్ కోసం ఇంటర్వ్యూ అక్కడి ఇంటర్వ్యూ బాగానే అటెండ్ చేసాను. టినగర్‌లో మావాళ్ళుంటే అక్కడే రెండు రోజులు మకాం వేసి మద్రాసంతా చూసుకుని తిరుగు ప్రయాణం కట్టాను మద్రాస్ ఎక్స్‌ప్రెస్ నెల్లూరు దాటాక బెర్త్ మీద పడుకుని నిద్రపోయాను. బాగ అలసి వుండటంచేత నిద్ర బాగానే పట్టింది. ఎప్పుడో కాజీపేట దాటేంతరువాత మెలకువ వచ్చింది.. సికింద్రాబాద్ స్టేషన్‌లో దిగి టీ కూడ తాగాను...

ఇంటికి వెళ్ళాక, ఆ రాత్రి ఏదో కావల్సి వచ్చి బ్రీఫ్‌కేస్ తెరిచి చూసాను. దాంట్లో నా ఒరిజినల్ సర్టిఫికేట్స్ పెట్టి వుంచుకున్న బ్యాగ్ కనుపించలేదు! తల తిరిగిపోయింది. అవిపోతే యింకేముంది, నా బ్రతుకు నాశనమయినట్టే. ఎన్ని యిబ్బందులోపడి చదువుకున్న శ్రమ ఫలితం. ఎన్నో ఆశలు పెట్టుకున్న అవి కనిపించకపోవటంతో నాకు గాభరా




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:


మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.


కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.


ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి...***
***కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో***
***దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 Tl



# నాణేనికి మరోవేపు

విత్తుంది. అసలు ప్రక్కన పెట్టే బెర్త్ మీదే మరచిపోయానా? లేక బ్రీఫ్‌కేస్ నుండి ఎవరయినా కొట్టేశారా? అయినా నా వరిజినల్స్ తీసుకుని వాళ్ళేం చేసుకుంటారు. వరిజినల్స్ కూడ అమ్ముకునే, కొనుక్కునే ప్రబుద్ధులు వుంటారని విన్నాను... ఇప్పుడేం చేయాలి? అదీగాక ఇంకో పదిహేనురోజుల్లో వైజాగ్‌లో మరో ఇంటర్వ్యూకు కూడ అటెండ్ కావల్సి వుంది. నాకు పిచ్చిపట్టినట్లయింది ... ఇప్పుడు నా కర్తవ్యమేమిటి? ఆ సర్టిఫికేట్స్ మీదే నా బ్రతుకు ఆధారపడి వుంది. ఎలాగ? ఏంచేయాలి? ఏమీ బోధపడలేదు.

డూప్లికేట్స్ సులభంగా దొరుకుతాయా? ప్రస్తుతం అటెండ్ కావల్సిన ఇంటర్వ్యూ గతేంటి? దానిమీద ఎన్నో ఆశలు పెట్టుకొని కూర్చున్నానే. ఇలాంటి ఆలోచనలతో నాలుగు రోజులు పిచ్చిపట్టిన వాడిలా తిరిగాను. అయిదో రోజు పోస్ట్ మాన్ కనిపించి, నాకేదో రిజిస్టర్ లెటర్ వుందంటూ అందించాడు. కవరు బరువుగా వుంది. ఎక్కడ్నుంచి— ఏదైనా సెలక్షన్ గురించా. కవరు చించి చూశాను నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను! ఎగిరి గంతేసినంత పనిచేశాను. ఇన్ని రోజుల నా మనోవ్యధకు కారణమైన నా వరిజినల్ సర్టిఫికేట్స్ నాకు దొరికాయి. నా కష్టార్జితం నాకు లభ్యమయింది. ఎంతో సంతోషమయింది వాటితోపాటు ఓ లెటర్ కూడా వుంది. అది వరంగల్ను నుండి వ్రాసింది. నా సర్టిఫికేట్స్ బ్యాగ్‌తో పాటు అతనికి దొరికాయట. పంపిస్తున్నట్లు గా వ్రాశాడు. బ్యాగ్ అతని దగ్గరే వుంచుకున్నట్లు, ఎప్పుడయినా కలుసుకున్నప్పుడు వప్పజెపుతా నన్నట్లుగా వ్రాశాడు. అతని అడ్రెస్ కూడా యిచ్చాడు... ఆ తరువాత నేను ఒకసారి పర్సనల్‌గా అక్కడికి వెళ్ళి అతన్ని కలుసుకుని థాంక్స్ చెప్పి వచ్చాను. ఆ తర్వాత నేను కలుసుగుంటూ వచ్చిన వైజాగ్ ఇంటర్వ్యూలో సెలక్టు కావటం, ట్రాన్స్‌ఫర్ చేయించుకుని హైద్రాబాద్ రావటం జరిగాయి... అతన్ని మాత్రం మరచిపోలేదు మా మధ్య స్నేహం అభివృద్ధి చెందింది. తరచూ లెటర్స్ వ్రాసుకుంటూ వుండేవాళ్ళం. అతని వుద్యోగ విషయంలో నేను హెల్ప్ చేయడం కూడా జరిగింది.

నాకు డివిజనల్ ఆఫీసులో పనివుండటం, దానికి సంబంధించిన వ్యక్తి పర్స్ దొరకటం విచిత్రంగానే వుంది. పర్స్ అతనికి వప్పగించి అలాగే నా పని పూర్తి కావించుకుందామన్న వుద్దేశ్యం నాలో లేకపోలేదు. ముఖ్యమైన పని ఉండటం వల్ల ఆ రోజు అతని ఆ డెస్కు వెళ్ళలేకపోయాను. మరునాడు ఆదివారం. తీరిగ్గా షేవింగ్, స్నానం ముగించుకుని, శాంతినగర్ బయలుదేరాను. ఇంటినంబరూ అదీ వుండటం వల్ల ఇల్లు కనుక్కోవటం అంత కష్టమేం కాలేదు...

వెళ్ళేసరికి, మధ్యవయస్కుడు ఒకాయన బయట వరండాలో పేపర్ చదువుతూ కూర్చున్నాడు. గేట్ తీసుకుని లోనికివెళ్ళాను.

''మధుసూదనరావు గారిల్లు ఇదేనాండి'' అని అడిగాను.

అవునన్నట్లుగా తలూపాడు.

''ఇంట్లో వున్నారా'' అడిగాను.

''నేనే మధుసూదనరావుని–ఏంకావాలి?'' అన్నాడు.

విషయం వివరించాను.

ఆయన ప్రక్కనున్న కుర్చీ చూపిస్తూ కూర్చోమన్నాడు.

కూర్చున్నాను.

అంతా చెప్పి పర్స్ ఆయనచేతి కిచ్చాను

పర్స్ అందుకుని దాంట్లోవున్న రశీదులు చూసుకుంటూ, ''దీంట్లో ఓ వందరూపాయల నోటుండాలే'' అన్నాడు.

నా గుండెల్లో రాయిపడింది.

నోటమాట రాలేదు

ఇంతలో ఇంట్లోంచి ఇద్దరాడవాళ్ళు, ఒక మగతను అక్కడకొచ్చారు.

అతను మళ్ళీ అదే అడిగాడు.

అందరి కళ్ళూ నన్ను అనుమానంగా చూస్తున్నాయ్

తల తీసేసినంత పనయింది.

జరిగింది వివరించి అక్కడ్నుంచి బయటపడేసరికి నా తల వేడెక్కింది.

ఎంత చెప్పినా ఆయన అనుమానం మాత్రం అలాగే వుండిపోయినట్టుంది–ఎందుచేతంటే; ఆ తరువాత నా పని గురించి డివిజనల్ ఆఫీసుకు వెళ్ళినప్పుడల్లా, అతను నన్ను అదోలా చూసేవాడు– ఈ సంఘటన జరిగుండకపోతే నా పని ఎప్పుడో అయుండేదే! కాని అది యిప్పటివరకూ జరగలేదు. అదీ విచిత్రం!

డాండ్రఫ్ (చుండు)ను తొలగిస్తుంది. జుట్టును ఆరోగ్యంగా ఉంచుతుంది

Clinic

క్లినిక్ షాంపూ

# కాని మీరు వదిలించుకోవాల్సింది ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు అయితే మీకు కావాల్సిన షాంపూ, క్లినిక్‌ని మించినదై ఉండాలి మరి

Clinic Special

కొత్తది

## క్లినిక్ స్పెషల్

క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగ్గా సరిపడిందని మాకు తెలుసు, అయితే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతి మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్‌ని మించినది...దాని పేరు క్లినిక్ స్పెషల్. ఆ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి. మామూలు చుండుకు క్లినిక్...ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్. ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికీ నివారణ.

హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

# వివా
## పగలూ రాత్రీ
## చేవనిచ్చే పానీయం!

గతిశీలమైన నేటి ప్రపంచంలోని వత్తిడికి తట్టుకోవాలంటే,
చేవనిచ్చే వివా మీ కెంతో అవసరం.

**వివా రోజంతటికీ కావలసిన చేవను పెంపొందిస్తుంది!**

వివాలోని ఆధునికమైన సూత్రీకరణ మూలంగా, దీనిలో ఎక్కువ శక్తినిచ్చే 'మాల్ట్', 'టిష్యూ'ను పెంపొందించే ప్రోటీన్లూ ఉన్నాయి. ఇవి పనికీ, ఆటకీ కావలసిన శరీర శక్తిని పెంపొందిస్తాయి.

**వివా, ఖర్చయిన మీ శక్తిని భర్తీ చేస్తుంది రాత్రి పూట!**

పడుకోబోయే ముందు, వేడి వివా ఒక కప్పు తీసుకుంటే, అది మీకు సరియైన పద్ధతిలో నిద్ర పట్టేలా చేస్తుంది. మీరు ప్రొద్దున్న చలాకీగా, తాజాగా పుంజుకుని, నిద్ర లేచే దాకా పోషక శక్తిని సమకూరుస్తూనే ఉంటుంది!

వివా లేకుండా జీవితంలో యింత ఆనందం ఎక్కడుంటుంది గనక!

**వివా ఎక్కువ విలువ నిస్తుంది!**

ఒక్క బాటిల్ వివాని ఆరోగ్యాన్నిచ్చే మరే యితర పానీయంతోనైనా పోల్చి చూస్తే, యిది మరి ఎక్కువ కప్పుల పానీయాన్ని యిస్తుంది.







ASP-JIL-3-79 TEL R

**JiL** జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

## కొత్త సీరియల్ ప్రారంభం!

ఆ రోజు ఆదివారం! వారంలో వచ్చే ఏడు రోజుల్లోనూ ఆదివారానికో ప్రత్యేకత వుంది. బడికి వెళ్ళే ఒకటో తరగతి పిల్లల నుంచీ ఆఫీసులకి పోయే ఆఫీసర్ల వరకూ – అందరూ ఆదివారాన్ని ఎంతో ఆదరంతో ఆహ్వానిస్తారు.

రోజూ భక్తిరంజని మొదలయ్యేసరికి లేచి యింటి పనుల్లో నిమగ్న మయ్యే ఈ తరం యిల్లాళ్ళు తెలుగు వార్తలౌతూండగా లేవడం, తొమ్మిదో గంటయ్యేసరికి స్నానం, భోజనం ముగించి జోళ్ళలో కాళ్ళు పెట్టుకొని కూర్చునే విద్యార్థులూ, ఉద్యోగస్థులూ ఆ వేళకి యింకా పక్కలమీద బద్ధకంగా దొర్లుతూండడం – యివన్నీ ఆదివారపు లక్షణాలన్నమాట!

# సాగర మథనం

కాని ఆ రోజు రవీంద్ర మాత్రం రోజూ లేచినట్టుగానే ఆరోగంట అయ్యేసరికి లేచి షేవింగూ, స్నానం ముగించుకుని ఆరున్నర అయ్యేసరికి అయ్యరు హోటల్లో కాస్త కాఫీ సేవించి మిత్రుడు శంకరం యిచ్చిన అడ్రసు కాయితం ఒకసారి చదువుకుని రిక్షా ఎక్కాడు.

యింటి నంబరు మరోసారి చెక్ చేసుకుని ఒక డాబా యింటిముందు దిగాడు. మరీ అంత పెద్ద భవనం కాకపోయినా కాస్త పెద్ద యిల్లనే చెప్పాలి దానిని. ఇంటికి సుమారు ఐదు గజాల ముందు చిన్న ప్రహరీ గోడ, దానికో గేటూ, గేటుమీద నున్న ఆర్చిమీద బోగన్‌విల్లా చెట్టు అస్తవ్యస్తంగా వుంది.

ఇంటిలో ఎక్కడా మనుషుల అలికిడి లేకపోవడం వలన కాస్త సంశయిస్తూనే లోపలికి నడిచాడు రవి. వీధి వరండాకున్న గ్రిల్‌లోంచి 'కాల్ బెల్' నొక్కాడు ఎంతకీ తలుపు తెరవకపోయేసరికి మరోసారి బెల్ కొడదామనుకుని గ్రిల్‌లో చెయ్యి పెడుతూండగా తలుపు తెరుచుకుని ఒక ముసలావిడ వచ్చింది

"నమస్కారమండీ!" అన్నాడు రవి తొట్రుపడుతూ.

"ఎవరు బాబూ నువ్వు? ఎవరు కావాలి?" అంది ఆవిడ తలుపు పక్కగా నిలబడి

"మీ యింటిలో ఒక పోర్షను అద్దెకిస్తామన్నారట... అది కనుక్కుందామని.." అన్నాడు రవి సగం మాటలు నమిలేస్తూ.

"ఒహో! అయినా యింత పొద్దున్నే వచ్చావేమిటి? యిలా వచ్చి కూర్చో. నేను యిప్పుడే వస్తాను." అని కుర్చీ చూపించి వెళ్ళిపోయిందావిడ.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత ఆలోచనల్లో పడ్డాడు రవి – "యీమె యీ యింటికి సర్వాధికారిణిలా మాట్లాడుతోందే! మరి శంకరం 'డాక్టర్ రామారావుగారిల్లు' అన్నాడే!"

"దేవుడు దగ్గిర దీపం వెలిగించుకుని వచ్చేసరికి కాస్త ఆలస్యం అయింది మరేమీ అనుకోకు బాబూ..." అంటూ వచ్చిందావిడ.

"ఫర్వాలేదండీ..." అన్నాడు రవి అంతవరకూ కూర్చోపెట్టినందుకు లోలోపల తిట్టుకుంటూనే.

"చూడు బాబూ, మా అబ్బాయికి కాకినాడ బదిలీ అయిపోవడంతో కోడలు కూడా అక్కడికే వెళ్ళిపోవలసి వచ్చింది. మా మనుమరాలు యిక్కడ



చదువుతూ వుండడంవలన ఆమెని కనిపెట్టుకుని నేనుంటున్నాను యిక్కడ. పైగా లంకంత సొంతిల్లు వుంచుకుని అక్కడికి వెళ్ళడానికి నాకిష్టంలేదు. ఇంత యింటిలో యిద్దరమూ ఎందుకని సగం అద్దెకిచ్చేద్దామనుకుంటున్నాం..." ఆమె చెప్పుకుని పోతోంది. "యికపోతే – మేం బ్రాహ్మణులం. ఈ అంటూ, నీచూ మాకు పడదు. అందుకని మాకు సరిపడే ఒక కుటుంబానికిద్దామనుకుంటున్నాం." ఆమె వాగ్ధోరణి కొద్దిసేపు ఆగింది.

'హమ్మయ్య! ఈవిడకి కావలసిన క్వాలిఫికేషన్ వుంది.' అనుకుని, "మేం సుద్ధ ఆరువేల నియోగులండీ" అన్నాడు వినయం ఒలకబోస్తూ.

"మంచిది బాబూ. ఎంతమంది పిల్లలు నీకు?" ఆమె అడిగింది. స్వజాతి అని కాబోలు. ఈసారి ఆమె ప్రశ్నలో కాస్త ఆప్యాయత చోటు చేసుకుంది.

'చచ్చాను. పెళ్లి అయినవారికే కాబోలు ఈ యిల్లు దొరికేది!' రావలసిన ఉద్యోగం పోయినట్లని పించింది రవికి. "నా కింకా వివాహం కాలేదండీ" అన్నాడు తల వంచుకుని.

అంతవరకూ సాదరంగా మాట్లాడుతున్న బామ్మగారికి అతను బ్రహ్మచారి అని తెలియగానే అతనో జులాయి మనిషిలా కనిపించాడు. "అబ్బే! మా యిల్లు అద్దెకివ్వం నాయనా" అంది పుల్లవిరుపుగా.

"మరి యింతవరకూ యిస్తానున్న ధోరణిలోనే వున్నారు కదండీ" అన్నాడు రవి నిట్టూరుస్తూ.

"ఆడవాళ్లమిద్దరమే వుంటున్న యిల్లు. ఏదో సంసారం చేసుకుంటున్న, ఒక చిన్న కుటుంబాని కిద్దామనుకున్నాం. కానీ నీలాంటి ఒంటరి పక్షికి కాదు" అంది ఆమె కాస్త కటువుగా.

అప్పటికే యిల్లకోసం తిరిగి, తిరిగి దొరక్క పోవడంతో విసిగిపోయిన రవి యిక ఆ యిల్లుకూడా దొరకదనిపించడంతో కాస్త కోపంగానే అన్నాడు — "చూడండి బామ్మగారూ! మీరు ఇల్లుఅద్దెకివ్వకపోతే పోయె. కాని ఒక్క విషయం గుర్తుంచుకోండి. పెళ్లి కాలేదన్న మాత్రాన ప్రతిమనిషి ఒక జులాయి వెధవకాదు. ఒకవేళ అటువంటి లక్షణాలున్న మనిషే అయితే పెళ్లి అయినంత మాత్రాన మడికట్టుకుని

# మారెళ్ల ఉమాదేవి

కూర్చోడు. మీరూహించుకుంటున్నట్టుగా నేను వెర్రివేషాలు వేస్తూ తిరిగే తిరుగుబోతుని కాదు. బాధ్యతగల వృత్తిలోవున్న ఒక ఉపాధ్యాయుణ్ణి. ఉదయాన్నే వచ్చి విసిగించినందుకు మన్నించండి" అంటూ విసురుగా లేచాడు.

"ఎవరితోనే బామ్మా... ఉదయానే వాదన పెట్టుకున్నావ్?" అంటూ వచ్చింది కవిత. "హాయ్ మాష్టారూ! వెళ్లిపోతున్నారేమిటి? బామ్మా! మా కొత్త లెక్చరరే ఈయన" అంది సంబరంగా. కవితను చూసి రవి కొంత ఆశ్చర్య పడ్డాడు. రవి క్లాసులు తీసుకుంటూ నాలుగు రోజులు మాత్రమే అయింది. చామన ఛాయ అయినా చూపరులను వెంటనే ఆకర్షించే విగ్రహం ఆమెది. రవి వెంటనే గుర్తించాడు కవిత సెకండియర్ కామర్సు స్టూడెంటని.

"హలో!" అన్నాడు కవితని చూసి.

"అయ్యో, అలాగా! ఎవరో అనుకున్నానే అమ్మాయీ" అన్నారు బామ్మగారు నొచ్చుకుంటూ.

"రండి మాష్టారూ" అంటూ సాదరంగా ఆహ్వానించింది కవిత. అప్పటికే బామ్మగారు లోనికి వెళ్లిపోయారు.

"లేదండి, ఒక ఫ్రెండ్‌ని కలుసుకోవాలి. వస్తాను." అన్నాడు.

"ఫర్వాలేదండి. కొద్దిసేపు కూర్చుని వెళ్లి పోదురుగాని." అంది కవిత.

ఆప్యాయతతో నిండిన ఆమె ఆహ్వానాన్ని తిరస్కరించలేకపోయాడు.

"మీరిలా కూర్చోండి, మాష్టారూ. క్షణంలో వస్తాను." అంది కవిత డ్రాయింగ్ రూంలోని సోఫా చూపిస్తూ.

రవి తల పంకించి టీపాయ్ మీదనున్న 'వీక్లీ' తిరగేస్తూ కూర్చున్నాడు.

ఐదు నిముషాల తర్వాత వచ్చింది కవిత. "సారీ మాష్టారూ, లేటయినట్టుంది... వచ్చేసరికి" అంది కాఫీకప్పు టీపాయ్‌మీద పెడుతూ.

"యిప్పుడే తీసుకుని వచ్చానండీ. మళ్లీ



యిప్పుడు తాగలేను." అన్నాడు రవి మొహమాటంగా. కవితతో యింతవరకూ క్లాసులో మాట్లాడలేదు రవి. వాళ్ల క్లాసులు కూడా మూడంటే మూడే తీసుకున్నాడింతవరకూ. ఎన్నాళ్లనుండో పరిచయ మున్నట్టు కవిత మాట్లాడుతూవుంటే అతనికి ఆశ్చర్యంగా వుంది.

"ఊహూఁ. అదేం కుదరదు. మీరు తీసుకుని తీరాలి." అంది కవిత దృఢంగా. రవి కాలేజీకి వచ్చి కొద్ది రోజులే అయినా 'మంచి లెక్చరర్' అన్న పేరు సంపాదించుకున్నాడు. స్టూడెంట్స్ అడిగే డౌట్స్ ఎంతో విపులంగా వాళ్లకి తేలికగా అర్థమయ్యేట్టు చెప్తాడు. అందరికీ కొద్ది రోజులలోనే అభిమాన పాత్రుడయ్యాడు.

"బై ది బై, మా బామ్మ సారీ చెప్పమంది" అంది కవిత అతని కెదురుగా వున్న సోఫా పక్కన నిలబడి.

"ఎందుకట? అయినా మీ బామ్మగారికి యింగ్లీషు వచ్చేమిటి?" అన్నాడు నవ్వుతూ.

"తెలుగులోనే చెప్పిందనుకోండి. మిమ్మల్ని ఎవరో కాలేజీ స్టూడెంటనుకుని కాస్త దూకుడుగా మాట్లాడిందిట!"

"ఆవిడ పెద్దవారు. ఏమైనా అన్నా మనలాటి చిన్నవాళ్లు ఏమీ అనుకోకూడదు. ఇంతకీ ఆవిడ నన్నేమీ అనలేదే! యిల్లు అద్దెకివ్వనన్నారు. నేను లేచిపోతూంటే మీరు వచ్చారు."

"మిమ్మల్ని... మిమ్మల్ని మీరని తెలియక లేదందిట. మీరు నిరభ్యంతరంగా మా యింట్లో వుండవచ్చు." అంది కవిత.

"మీ బామ్మగారి తరఫున వకాల్తా తీసుకుని మాట్లాడేస్తున్నారే!" అన్నాడు రవి నవ్వుతూ.

"సారీ అలాగే అనుకోండి."

"థాంక్సండీ." అన్నాడు రవి కృతజ్ఞతా పూర్వకంగా. అక్కడకి ట్రాన్స్‌ఫరై వచ్చిన దగ్గర నుండీ వేధిస్తున్న సమస్య ఆ రోజుతో తీరింది.

రవికి అతనుండవలసిన పోర్షన్ చూపించింది కవిత. చాలా రోజులై తలుపులు వేసివుండడంవలన గదులు రెండూ బూజుపట్టి వున్నాయి.

"హో కాంథీ సెట్టింగ్‌లా వుందంటారా ఈ గది?" అంది కవిత నవ్వుతూ గదినిండా వున్న సాలెగూళ్లు చూస్తూ.

"ఫర్వాలేదులెండి. నాకు ఆంజనేయ దండకం వచ్చు." అన్నాడు రవికూడా నవ్వుతూ.

"ఈ యిల్లు కట్టించేటప్పుడు ఈ పోర్షన్‌కి మా డాడీ కొంత స్టెప్ మదర్లీ ట్రీట్‌మెంట్ యిచ్చారు. చూడండి ఈ పోర్షనంతకీ యిదొక్కటే కొళాయి." అంది పెరటిలోని కొళాయి చూపిస్తూ.

"నేనుండేదీ ఒక్కణ్ణే కదండీ. సరిపోతుంది." అన్నాడు రవి.

"మీరిద్దరయ్యేసరికి మరో కొళాయీ, యితర వసతులూ సమకూరుస్తాం." అంది నవ్వుతూ.

'ఏమిటీ అమ్మాయి చొరవ? వచ్చి అరగం టైంది. ఎంత చనువుగా మాట్లాడేస్తోంది?' అనుకున్నాడు రవి.

రవి ఎప్పుడు యింట్లో దిగాలో బామ్మగారే పంచాంగం చూసి చెప్పారు. ఆ రోజు ఉదయమే వస్తానని చెప్పి బయలుదేరాడు రవి.

* * *

రవి యిల్లు చేరేసరికి శంకరం షేవింగ్ చేసుకుంటున్నాడు.

"ఏమిటోయ్ టెస్ట్ డెబ్యూలోనే సెంచరీ చేసినట్టు వెలిగిపోతోంది మొఖం! యిల్లు సంపాదించినట్టున్నావే!" అన్నాడు రవిని చూసి.

జరిగినదంతా చెప్పి "ఎల్లుండి ఉదయమే గృహప్రవేశం. కనుక తనని యీ యింటినుండి ఎల్లుండి ఉదయం ఏదో గంట వరకే రిలీవ్

చేసెయ్యమని ప్రాధేయపడుతున్నాడు రవి.'' నాటకీయంగా అన్నాడు రవి, శంకరం ఎదురుగా సోఫా లాక్కుని కూర్చుంటూ.

''అరే ! మా హోం మినిష్టరు రేపు రాత్రికి వస్తోంది. తను వచ్చాక ఒక్క రోజు అయినా నువ్వు వుండకపోతే ఆమె ఒప్పుకోదే !'' అన్నాడు శంకరం. రవీ, శంకరం బి. కాం. వరకూ కలసి చదివారు. బి.కాం. తర్వాత శంకరం బ్యాంక్‌లో జాయినయ్యాడు. రవి మాత్రం యం. కాం. చెయ్యడానికి సాగర్ యూనివర్సిటీకి వెళ్లిపోయాడు.

''బాబ్బాబూ, ఆ బామ్మగారి ముహూర్తానికి వెళ్లకపోతే మళ్లా ఎన్ని రోజులు ఆగవలసివస్తుందో! కనుక మరేమీ అవాంతరాలు కల్పించకుండా ఆ రోజు నన్ను వెళ్లనీయ్.'' అన్నాడు రవి.

''సరేలే. ఈ సెలవు దినాన్ని ఎలా సద్వినియోగ పర్చుదాం ?'' అన్నాడు శంకరం లేస్తూ.

''ఏముంది బజార్లు సర్వే చేస్తూ ఓ రెండు గంటలూ, సినిమా హాలు దగ్గర టిక్కెట్ల క్యూలో ఒక గంటా, హాల్లో మూడు గంటలూ, సిటీబస్సుల్లో, ఒక గంటా – గడిపేస్తే అయిపోతుంది.''

''అబ్బా ! నువ్వు ఆ సుకవిత్వం బాగ చెప్తావోయ్. సరేకాని నేను టాయ్‌లెట్ పూర్తి చేసుకుని రావడానికి ఒక అరగంట పడుతుంది. ఈ అరగంటా నువ్వేలా ఏడుస్తావో మరి !'' అని బాత్‌రూంలో కెళ్లిపోయాడు శంకరం.

* * *

సినిమా హాలు దగ్గర జనం ఎలుచగానే వున్నారు. మిత్రులిద్దరూ టిక్కెట్లు తీసుకుని లోనికి వెళ్లేసరికి ఏవో స్లైడ్లు చూపిస్తున్నారు.

''యిక రక్తదానానికి సిద్ధపడు.'' అన్నాడు శంకరం నవ్వుతూ సీట్లో కూర్చుంటూ.

''యింత మహాసట్నంలో కూడా దోమల్ని పెంచుతున్నారా ?'' అన్నాడు రవి తన సీట్లో కూర్చుంటూ.

ఏదో అనబోతున్న శంకరాన్ని 'ష్' అంటూ వారించాడు రవి సినిమా మొదలవ్వడంతో.


పై వారమే!

నిధి చాల సుఖమా?


రవి, శంకరాలకి ఎదురుగా ఓ జంట కూర్చున్నారు. సినిమాలో హాస్య సన్నివేశం వచ్చేసరికి ఆమె కాస్త గట్టిగానే నవ్వుతోంది పక్కనున్నాయనతో ఏదో చెపుతూ. రవి సినిమాతోపాటు వాళ్లనికూడా గమనిస్తున్నాడు. ఆమె అలా ఎక్కువగా నవ్వడం చూసి 'చైల్డిష్ బిహేవియర్' అనుకున్నాడు మనసులో.

శంకరం మాత్రం సినిమాలో లీనమైపోయాడు. ఇంటర్వెల్లో లైట్లు వెలిగాయ్. ''పదవోయ్, కాస్త పొగ వదిలివద్దాం.'' అన్నాడు శంకరం రవి భుజం తట్టుతూ. రవి సీట్లోంచి లేస్తూ ఎదుట జంటని పరికించాడు అప్రయత్నంగా. వెంటనే అతన్ని గుర్తుపట్టగలిగాడు. అతను ఎకనమిక్స్ లెక్చరర్ గోపీనాథ్ ! కాలేజీలో అందరు లెక్చరర్లూ ఎంతో సరదాగ వుంటారు. కాని గోపీనాథ్ మాత్రం చాలా ముభావంగా వుంటాడు. 'అతను బాగా కలవారి యింటినుండి వచ్చాడు కనుక అలా బెట్టుపోతాడు.' అన్నాడు స్టాటిస్టిక్స్ లెక్చరర్ శ్రీహరి ఒకసారి రవి అడిగితే. దానితో రవి గోపీనాథ్‌ని పలుకరించడం కూడా మానుకున్నాడు. గోపీనాథ్ పక్కనున్న అమ్మాయిని చూసి వులిక్కిపడ్డాడు రవి. 'ఈమె నెక్కడ చూసానబ్బా !' అనుకున్నాడు బయట సిగరెట్ కాలుస్తూ.

యింటర్వెల్ తర్వాత సినిమామీద శ్రద్ధ చూపలేకపోయాడు రవి. ఆమెనెక్కడ చూసాడో గుర్తు రావడంలేదు. బాగా పరిచయమున్న మొహంలా కనిపిస్తోంది.

ఆ రాత్రి పక్కమీద దొర్లుతూ ఆలోచించ సాగేడు ఆమెగూర్చి. తన పూర్వ విద్యార్థినులందరినీ గుర్తు చేసుకున్నాడు. ఊహుఁ. వాళ్లెవరూ కాదు. అతడలా తనకి పరిచయమున్న అమ్మాయిలందర్నీ గుర్తు చేసుకుంటూండగా తటుక్కున బుర్రలో ఓ మెరుపు మెరిసింది !

(ఇంకా వుంది)

ప్రకృతి రహస్యం కనుగొనబడింది




# ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది

**చర్మానికి నలుపుదనం ఎలా సంక్రమిస్తుంది**

ఏమిటీ, కాలక్రమేణా మన వళ్లు నెమ్మది నెమ్మదిగా నల్లబడుతుందా ? అవును, ఇది లోపల నుంచీ, బయట నుంచీ కూడా రెండు విధాల జరుగుతుంది మీ చర్మం లోపల ఒక నల్లని రంగు పదార్థం ఉంది. చర్మపు నలుపు దనానికి ఇదే కారణం. ఇది ఎంత హెచ్చుగా ఉంటే మనుషులు అంత నల్లగా ఉంటారు.



ఇది ఇలా ఉండగా, మీరు ఎండలోకి వెళ్లినప్పుడల్లా సూర్యుని అల్ట్రావయొలెట్ కిరణాలు మీ చర్మంలో ప్రవేశిస్తాయి దాంతో మీరు మరికాస్త నల్లబడతారు.

**వంటి చాయను పెంచడానికి పురాతన పద్ధతి ఏదైనా ఉందా ?**

పందలాది సంవత్సరాలుగా ఆడవారు— సెనగపిండి, పాల మీగడ, నిమ్మరసం, గ్లిసరీన్ ఇంకా ఏవేవో ఉపయోగిస్తూ వస్తున్నారు వీటి మూలంగా చర్మం మెత్తబడి కాస్త మెరవచ్చు. అంతేగాని చర్మాన్ని నిజంగా ఎర్రగా చేయలేవు. మరొక తెగకు చెందినవి బ్లీచింగ్ పదార్థాలు. ఇవి ఎంత హానికరమైనవో వేరే చెప్పనక్కర్లేదు. అపురూపమైన మీ పట్టు బట్టల్ని మీరు బ్లీచ్ చేస్తారా ? మీ చర్మం కూడా పట్టులాగ నాజూకు అయినది. పట్టుకంటె అపురూపమైనది.

**విజ్ఞాన విజయం ! ఫెయిర్ అండ్ లవ్లీ సహజంగా, మృదువుగా తన పని చేస్తుంది.**

ఫెయిర్ అండ్ లవ్లీ విజ్ఞాన ప్రపంచం సాధించిన విజయం. ప్రపంచంలో మొట్టమొదటిసారిగా, సహజంగా, మృదువుగా మీ శరీర చాయను ఎర్రబరిచే సాధనం ఇది. ఫెయిర్ అండ్ లవ్లీ క్రీమును మీరు రాసుకున్నప్పుడు, అది మీ చర్మంలోకి ప్రవేశించి పనిచేస్తుంది—సహజంగా, మృదువుగా, సురక్షితంగా. దాంతో, మీ శరీర చాయ ఇతరులు మెచ్చుకొనేలా ఎర్రబడుతుంది.



అంతేకాదు ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మాన్ని బయటనుంచి కూడా సంరక్షిస్తుంది. దీనిలో సూర్య కిరణాలను వడబోసే పదార్థాల మిశ్రమం ఉంది. ఇది ఎండలోని అల్ట్రావయొలెట్ కిరణాలను వడబోసి మీ చర్మం ఎండ వల్ల నల్లబడకుండా కాపాడుతుంది. అయినప్పటికీ సూర్య కిరణాలలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు.

**6 వారాలకు మీకే తేడా కనపడుతుంది !**

వాడి చూస్తే మీకే రుజువు అవుతుంది. ఫెయిర్ అండ్ లవ్లీని ఆరు వారాలపాటు నియమంగా వాడితే, మీతో పాటు ఇతరులు కూడా మీ వంటి చాయలో మార్పును గుర్తిస్తారు. ప్రకృతి సహజమైన రీతిలో మీ చర్మాన్ని లొంగదీస్తుంది ఫెయిర్ అండ్ లవ్లీ.

**ఫెయిర్ అండ్ లవ్లీ క్రీమ్ నల్ల చర్మాన్ని ఎర్రబరచడంతో పాటు ఇంకా చేస్తుంది.**

ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మానికి కోమలత్వం సమకూరుస్తుంది. మనోహరమైన సువాసన చేకూరుస్తుంది. రోజుకు కనీసం ఒకసారి వాడండి. రెండు సార్లు వాడితే మరీ మంచిది. నియమంగా వాడితే, మీ వంటి చాయ పెంపొందుతుంది, అలాగే ఉంటుంది. సహజంగా, మృదువుగా ఎరుపెక్కుతుంది.









**ఫెయిర్ అండ్ లవ్లీ — నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సున్నితమైన తీరు**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

లింటాస్-FALOV.10 254 TL



# ఆనందాల పంట
# ...దాన్ని పెంచి పోషించేది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైర్లతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది ...మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

**జై కిసాన్ యూరియా 46.4% నత్రజని** అతి తెల్లటిది, అతి స్వచ్ఛమైనది, అతి శక్తివంతమైనది. దీనిలో బైయూరేట్ పాలు అతి తక్కువ (0.5% కంటే తక్కువ). అంచేత ఆకుల మీద పిచికారి చేయడానికి సురక్షితమైనది. అన్ని పంటలకూ భూమిమీద పై చల్లుగా అనువైన ఎరువు.

**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0** అత్యధికంగా నత్రజని, ఫాస్ఫేటూ సమానమైన పాళ్లలో గల శక్తివంతమైన ఎరువు. దాదాపు పూర్తిగా నీటిలో కరుగుతుంది. దీనిలోని రెండు పోషక పదార్థాలూ కూడా ఒకే సమయంలో భూమిలో కరిగి పెరుగుతున్న పంటకు అందుబాటులో ఉంటాయి.

**జై కిసాన్ సంపూర్ణ 19:19:19** అతి చిక్కనైన కాంప్లెక్స్ ఎరువు. దీనిలో నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌లు సమానమైన పాళ్లలో ఉన్నాయి. దాదాపు పూర్తిగా నీటిలో కరిగే ఈ ఎరువులో 57% పోషక పదార్థాలున్నాయి. అవన్నీ ఒకే సమయంలో భూమిలో కరిగి పంట వాటిని సులభంగా గ్రహించడానికి వీలు పడుతుంది. పొటాష్ లోపం గల భూములకు జైకిసాన్ సంపూర్ణ ప్రత్యేకించి లాభదాయకమైనది.

**జైకిసాన్ యూరంఫాస్, సంపూర్ణ ముఖ్యంగా అధిక దిగుబడి రకపు వరి, చెరకు, కాయగూరలు, పత్తి, జొన్న, గోధుమ మొదలైన పంటలకు బాగా అనువైనవి. అంతేకాదు, కాఫీ, తేయాకు లాంటి తోట పంటలకూ, మామిడి, కమలా, నారింజ, అరటి మొదలైన పండ్ల తోటలకూ కూడా ఎంతో అనువైనవి.**

**జై కిసాన్ సౌభాగ్య 14:35:14** నత్రజని, పొటాష్‌లు దీనిలో సమానమైన (ఒక్కొక్కటి 14%) పాళ్లలో ఉన్నాయి. పైగా 35% ఫాస్ఫేటు కూడా ఉంది—అంటే మొత్తం 63% పోషక పదార్థాలు ఉన్నాయన్నమాట. ఫాస్ఫేటు హెచ్చుగా ఉండటం వల్ల జైకిసాన్ సౌభాగ్య ముఖ్యంగా వేరుశనగ, ఇతర నూనె గింజల పంటలకూ, పప్పు దినుసుల పంటలకూ బాగా అనువైనది. దుంపజాతి పంటలైన బంగాళాదుంప (ఆలుగడ్డ), పసుపు, కందమూలం, ఉల్లి మొదలైనవాటికి కూడా ఎంతో మంచిది. చెరకు, పత్తి పంటలకూ, ఏలకులు మొదలైన తోట పంటలకూ కూడా ఉపయోగకరమైనది.

**జై కిసాన్ డయంఫాస్ 18:46:0** డయంఫాస్ 18:46:0 లో 18% నత్రజని, 46% ఫాస్ఫేటు ఉన్నాయి. అత్యధికంగా పాళ్లు కలిగిన కాంప్లెక్స్ ఎరువు అయినందువల్ల తక్కువ పరిమాణంలో వేస్తే చాలు. అంచేత ఖర్చుకూడా చాలా తక్కువ. ఈ ఎరువు ప్రత్యేకించి, హెచ్చుగా ఫాస్ఫేట్ కావలసిన పంటలకు అంటే వేరుశనగ, పప్పు దినుసులు, నూనె గింజలు మొదలైన వాటికీ, పసుపులాంటి దుంపజాతి పంటలకూ అనువైనది. చెరకు, పత్తి పంటలకు కూడా మంచిది.

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ




**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: కర్నూలు, సికింద్రాబాద్, బెంగుళూరు, హుబ్లి, కొంకణ్, నాగపూర్, పూనా.
మీ జైకిసాన్ ఎరువుల్ని జువారి వారి పసుపు పచ్చ దుకాణాల్లో కొనుక్కోండి.






ZUA 91-2038 TL




అప్పుడే ఉదయభానుడు తూర్పు కొండలు దాటి తన దినచర్యకి పురోగమిస్తున్నాడు.

మబ్బులుకూడా లేని ఆ విశాల ఆకాశంలాగే తన చుట్టూ నిర్మానుష్యంగా వున్న మైదానాలు, తూగుపు కొండల్నీ చూస్తూ ప్రకృతికి నమస్సులర్పించాడు, అప్పుడే తన డ్యూటీకి వచ్చిన రామారావ్.

రామారావ్ కొద్ది నెల్ల క్రితమే ఆ మారు మూలనున్న సత్యాపురం స్టేషన్‌కు అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్‌గా వచ్చాడు.

సత్యాపురం ఊరికి ఐదు మైళ్ళ దూరంలో ఏర్పాటు చేయబడ్డ అతిచిన్న క్రాసింగ్ స్టేషన్. రోజూ ఆగే రెండు ప్యాసింజర్ రైళ్ళు తప్ప మరే విధమైన జనసంచారం కనబడని ఆ ఎడారిలో అప్పుడప్పుడు గూడ్సు రైళ్ళు కొన్ని ఆగినా అవి అక్కడనుండి ఎప్పుడు పరిగెడదామా అన్నట్లు చప్పుడు చేస్తూ చుట్టుపక్కల ఉండే పశువుల

# ఇదిగో!

## క్రొత్త ప్రెస్టీజ్




## అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ మీరుకోన బోయే అతి భద్రమైన ప్రెషర్ కుక్కర్

ఆహార పదార్థములచే వెయిట్ వాల్వ్ మూయబడినచో మీ ప్రెషర్ కుక్కర్‌లో హెచ్చు ఒత్తిడి కలుగును. అట్టి సమయమున మీ కుక్కర్ భద్రత సేఫ్టీ ప్లగ్ మీదనే ఆధారపడియుండును మీ ప్లగ్ నకిలీదై వుండవచ్చు. మీకు తెలియదు...ఎందువలనగా మీరు అసలు సేఫ్టీ ప్లగ్‌ను నకిలీ ప్లగ్‌ను గుర్తించలేరు.

అందువలనే, పూర్తి భద్రత మనసులో ఉంచుకొని ఏమాత్రము ప్రమాదము జరగడానికి వీలులేకుండా, ఈ "క్రొత్త ప్రెస్టీజ్" రూపొందించాము. దీని అద్వితీయ గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ మీ కుక్కర్ భద్రతను ఎల్లకాలము కాపాడుతు సేఫ్టీ ప్లగ్ అవసరము లేకుండా చేస్తుంది.



### అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా క్రొత్త ప్రెస్టీజ్‌కు నూటికి నూరు పాళ్ళు భద్రత ఎలా సమకూరుతుంది?

సేఫ్టీ ప్లగ్‌ను త్రోసి వేసేంతగా ఒత్తిడి పెరుగకముందే అధిక ఆవిరి గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ఖచ్చితముగా బయటకు పోవును. నకిలీ లేక పాత "స్పేర్స్" వాడినను, మీ ప్రెషర్ కుక్కర్ పూర్తి భద్రతనిచ్చును. ఎల్లవేళలందు.



### క్రొత్త ప్రెస్టీజ్ మీకు ఎక్కువ సౌకర్యము నిచ్చును

గేస్కెట్ ఆవిరిని వొదిలిపెట్టగానే మీరు చేయవలసింది దాని స్థానములోనికి దానిని త్రొయ్యడము మాత్రమే. అప్పుడు మీ కుక్కర్ తిరిగి వాడకానికి కొన్ని క్షణములలో సిద్ధము. సేఫ్టీ ప్లగ్గే అనవసరము. అందుచే దానిని మార్చే అవసరములేదు. దాని గురించి చింతించనవసరము లేదు.



### క్రొత్త ప్రెస్టీజ్ ఎంతో మన్నిక కలది

ఆవిరి ఒత్తిడి ఏ సమయమునైనను అపాయకరమైన స్థితికి చేరదు కనుక, కుక్కర్‌కు అరుగుదల చాల తక్కువ. అందుచేతనే మిగతా మామూలు కుక్కర్లకన్న క్రొత్త ప్రెస్టీజ్ చాలకాలము మన్నును.



### క్రొత్త ప్రెస్టీజ్ వల్ల ఎన్నో అధిక లాభములు

* ఎక్కువ మన్నికైన దళసరి అడుగు.
* మన్నికైన స్టెయిన్‌లెస్ స్టీలు స్క్రూలతో బిగించిన దృఢమైన పిడులు.
* ఎప్పుడు వేడెక్కని, పట్టునిచ్చు క్రొత్త "అక్సులరీ" పిడి.
* పరుత్వము, దృఢత్వము కలిగిన క్రొత్త "ట్రివెట్"
* అద్దములాంటి అందమైన తళతళ.
* ఉత్సాహము కలిగించు క్రొత్త వంటల పుస్తకము.
* అనుకూలమైన ఆరు సైజులు.

మరియు ఏ లాభములవలన భారతదేశములో 30 సంవత్సరములకు పైగా ప్రెస్టీజ్ కుక్కర్ అందరికి కావలసిన కుక్కర్ అయినదో ఆ లాభములన్నీ ఇందులో వున్నాయి.

**tt తయారీ.**




భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు



హిందూస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ తెలుగు సమితి (బెంగుళూరు) దశమ వార్షికోత్సవాల సందర్భంగా సమితి తరఫున డా. దాశరథి, డాక్టర్ సి. నారాయణరెడ్డిగార్లని సన్మానిస్తున్న హెచ్. ఏ. ఎల్. ఛైర్మన్ కాప్టెన్ బి. కె. కపూర్, కర్నాటక విద్యుత్ శాఖా మాత్యులు శ్రీ బి. అశ్వత్థరెడ్డిగార్లని చిత్రంలో చూడవచ్చు.

# ఛార్జ్ షీట్

కాసరులని మాత్రం బాగా ఆకట్టుకుంటాయి. ఒక్క మాటలో వ్రాయాలంటే ఆ స్టేషన్ నిర్మానుష్యానికి, దేశంలో అభివృద్ధి చెంద వలసిన ప్రాంతాలు చాలా ఉన్నాయి సుమీ! అని చాటిచెప్పే దర్పణమే.

స్వతహాగా మొహమాటస్థుడయిన రామారావ్ కొత్తలో కొంత ఇబ్బంది పడ్డా క్రమక్రమంగా ఆ ఒంటరితనానికీ, ఎడారి వాతావరణానికి అలవాటుపడ్డాడు బాగా. రోజూ తన డ్యూటీ అవగానే తన క్వార్టరుకు ఇచ్చిన యింట్లో స్వయంపాకం చేసుకోవడం, అసంపూర్తిగా వదిలేసిన తన చదువును కొనసాగిద్దామా, వద్దా అన్న ఆలోచనా ముసుగులో నిద్రపోవడం రామారావ్ నిత్యకృత్యం.

ఆ రోజు...

ప్రొద్దున్నే వెళ్ళవలసిన ప్యాసింజర్ బండి పొగ వదుల్తూ దూరాన్ని ఎంత త్వరగా మింగేద్దామా అన్న కోపంతో స్టేషన్ నుండి దూరంగా పరిగెడుతూంది.

రామారావ్ టిక్కట్ల బీరువా తాళాయి వేసి కూర్చుంటూ పోర్టర్ని;

"సోములూ... సోములూ..." అంటూ కేకేసాడు.

"సార్ ... " అంటూ లోపలకు సోములు రాగానే రామారావ్,

"నైన్ అప్ ఎక్స్‌ప్రెస్ ఇంకా పోలేదు కదరా! సోములూ; ఇంకో అరగంటలో రావచ్చు. దూరం ఎక్కడికీ పోకండి ... " అని ఒకసారి హెచ్చరించాడు.

"అలాగే సార్! ఒక ఐదు నిముషాల్లో చాయ్ తాగి వచ్చేం" అని సోములు బైటకు ఉడాయించాడు.

ఆ స్టేషన్ వద్ద ఎడారిలో ఒయాసిస్‌లా 'నాయర్ టీ స్టాల్' ఒక్కటే వాళ్ళందరికీ కాలం గడిపే స్థలం. ఏ మాత్రం బ్రేక్ దొరికినా పోర్టర్లూ, క్యాబిన్‌మెన్లూ అక్కడే జేరి కాలం గడుపుతూ, మళ్ళీ రైలు వచ్చే టైమ్‌కి మాస్టర్ ఇచ్చే పిలుపు కోసం ఎదురు చూడడం పరిపాటే.

పొద్దున్నే లేవగానే కాఫీ కడుపులో పడకపోతే రామారావ్‌కి అడుగు ముందుకి పడదు. పాలు ఆ టైమ్‌లో దొరకవు కాబట్టే తయారుగా పాలపొడి డబ్బా అతని కాఫీ అవసరం తీరుస్తూ ఉంటుంది.

పక్క స్టేషన్ నుండి 'బెల్' రావడంతో, చదువుతున్న పాతపేపరు పక్కన పెట్టి రామారావ్ అట్నుంచి రాబోయే గూడ్సు రైలుకు "లైన్ క్లియర్" ఇచ్చాడు.

బైట నాయర్ స్టాల్‌వైపు చూసి —

"సోములూ ... సోములూ...!" అంటూ పిలిచి, చేయి ఊపాడు.

సోములూ; మిగతా రైల్వే పనివాళ్ళు హడావుడిగా వాళ్ళ వాళ్ళ స్థానాలకు జేరుకున్నారు.

"గూడ్సు బండి 'బ్లాక్' అయింది. బహుశా ఇక్కడే నైన్ అప్‌కి క్రాసింగ్ ఉండొచ్చు" అని సోములుకి, మిగతావాళ్ళకి చెప్పి ఇటు తిరిగేలోగా రెండవవైపు స్టేషన్ నుంచి —

"రామారావ్! నైన్ అప్ బ్లాక్ యిందోయ్...!" అని ఆ స్టేషన్ మాస్టర్ చెప్పాడు.

గూడ్సుబండి పక్క స్టేషన్ వదలిన సంకేతం గ్రహించి; రామారావ్ తన స్టేషన్ వాళ్ళకి 'క్రాసింగ్' ఉంటుందని, 'గూడ్సు'కి 'సిగ్నల్' ఇమ్మన్నాడు. తను ఎక్స్‌ప్రెస్‌కి లైన్ క్లియర్ ఇచ్చాడు.

మరో పది నిమిషాల్లో ఎక్స్‌ప్రెస్ కూడా అవతల స్టేషన్ వదిలినట్లు తెల్సింది.

రామారావ్ స్టేషన్ బైటకి చూశాడు. కనుచూపు మేరలో గూడ్సు వస్తూన్న జాడ లేదు.

అప్పటికే ఇరవై నిమిషాలు దాటింది, అది ఆ స్టేషన్ వదిలి.

ఇవతలనుండి ఎక్స్‌ప్రెస్ ఇంజన్ విజిల్ బాగా దగ్గరలో వినబడుతోంది.

ఆ స్టేషన్‌లో ఎక్స్‌ప్రెస్ ఆగదు. కానీ ఈ రోజు ఈ గూడ్సు క్రాసింగ్‌వల్ల అది తప్పనిసరిగా ఆగవలసివస్తోంది. రామారావ్ మరి కాసేపు వేచి ఇంక 'గూడ్సు' అయిపులేక దానికిచ్చిన సిగ్నల్ కాన్సిల్ చేయమని 'కాబిన్'కి చెప్పి ఎక్స్‌ప్రెస్ లోపలికి రావడాన్కి అనుమతించాడు.

ఎక్స్‌ప్రెస్ స్టేషన్‌లో నిలిచి పది నిమిషాలు దాటింది. రోజూ పొద్దున్న ఆరు గంటలకే వెళ్ళిపోయే ఆ బండి ఈ రోజు రెండు గంటల లాలస్యం కావడంతో, ఈ గూడ్సు బండి క్రాసింగ్‌కి రాకపోవడంవల్ల, సత్యాపురం స్టేషన్‌కి ఆ క్షణంలో 'పండగ' కళ వచ్చింది; దిగిన ప్రయాణీకుల హడావుడితో.

అసలే ప్రయాణం; దాంతో బండి లేటవడం. వీటికో చిరాకుగా ఉన్న ప్రయా

ణీకులు, బ్రష్‌లు, ఫ్లాస్క్‌లు, లోటాలూ పట్టుకుని స్టేషన్ చుట్టుముట్టారు.

మరో గుంపు నాయర్ టీ స్టాల్ వైపు పరుగులీశారు. తన ఆఫీస్‌లో జేరిన ప్రయాణీకుల గుంపుకు సావధానంగా రామారావ్ "మీకు టీ, సిగరెట్లూ వగైరా ఆ ఎదురుగా ఉన్న షాప్‌లో దొరుకుతాయి. మీ బండి ఇంకొద్ది సేపట్లో ఇక్కడనుండి బయల్దేరుతుందని..." సర్దిచెప్పి ఇటువైపునుండి వచ్చే గూడ్సు గురించి ఆలోచనలో పడ్డాడు.

అప్పటికీ గూడ్సుబండి జాడలేదు. పక్క స్టేషన్ నుండి చల్లగా తెల్సింది అరగంట తర్వాత — ఆ గూడ్సు మధ్యలోనే ఆగిందనీ; కొద్ది సేపట్లో ఆ స్టేషన్ చేరవచ్చనీ.

చుట్టుపక్కల మరో దుకాణం పేరుకైనా లేదేమో, నాయర్ టీ స్టాల్‌లోని సరుకంతా అమ్ముడయిపోయింది. నిరాశపడ్డ ప్రయాణీకుల్లో సతీష్ ఒకడు. అతను ఖాళీ ఫ్లాస్క్ తీసుకుని స్లీపర్‌లో ఉన్న భార్య రాణిని ఉద్దేశించి —

"ఎక్కడా పాలు దొరకలేదు రాణీ! పాపని ఎలాగైనా కాసేపు ఊరడించు" అన్నాడు.

అప్పటికే పాప గోలతో విసిగిపోయిన రాణి — "మీరే ఊరుకోబెట్టండి మీ అమ్మాయిని" అంటూ సతీష్‌కి అందించింది.

పాపను భుజంమీద సముదాయిస్తూ మళ్ళీ ఫ్లాస్క్‌తో స్టేషన్‌లో అడుగుపెట్టాడు సతీష్. రామారావ్ చుట్టూ ఉన్న ప్రయాణీకుల నుద్దేశించి —

"ఇంకో ఇరవై నిముషాల్లో బండి బయల్దేరుతుంది. మీరంతా మాతో సహకరించి మీ మీ స్థానాలకు చేరుకోండి" అన్న విన్నపం సతీష్ చెవుల్లో కూడా పడింది.

రామారావ్ తన చుట్టూ వున్న వాళ్ళందరూ మెల్లగా దూరమవుతున్నా వెనక్కి తిరగని సతీష్‌వైపు ప్రశ్నార్థకంగా దృష్టిసారించాడు.

"మా అమ్మాయి పాలకోసం చాలా యిబ్బంది పెడ్తోంది. ఈ చుట్టు పక్కల ఎక్కడైనా ఒకగ్లాసు పాలు దొరుకుతాయేమో అని చూస్తున్నాను. మీరే కొంచెం సహాయం చేయాలి" అన్నాడు సతీష్.

రామారావ్ బైటకు చూసి నాయర్ స్టాల్ మూసి ఉండడం గమనించాడు. అది గ్రహించిన సతీష్,

"నేను అక్కడ నుండే యిటు వస్తున్నా! ఒక్క గ్లాస్ పాలు మీరు ఎక్కడనుండైనా తెప్పించండి ... ప్లీజ్ ..." అంటూ రెండు రూపాయల నోటు, ఫ్లాస్క్ రామారావ్ వైపుంచాడు.

రామారావ్, "ఆ నోటు లోపలపెట్టండి. ఇక్కడ యీ టైమ్‌లో పాలు అసలు రావు. అయినా, ఇంకో పావుగంటలో మీ బండి బయల్దేరుతుంది. కొంచెం ఓపిక పట్టండి" అని సతీష్‌తో అన్నాడు.

రామారావ్ పైకి అలా అన్నా తనకీ తెల్సు ఆ బండి అక్కడనుండి ఇంకో అరగంట వరకూ కదల్దనీ; అలా బయల్దేరినా ఆ పాప ఆకలి తీరడానికి ఇంకో గంటదాకా ఆగాలనీ.

సతీష్ నిరాశా, బాధ అర్థం చేసుకొన్నాడు కాబట్టి ఎలా అయినా అతనికి సహాయపడాలని పించింది రామారావ్‌కి. అప్పుడు ఊహకి అందింది తన యింట్లో వున్న పాలపొడి డబ్బా. వెంటనే రామారావ్ —

"సోములూ!..." అంటూ పిల్చాడు.

సోములు "గూడ్సుబండి పోయిందా, సార్; లైన్ క్లియరయిందా...? గంట కొట్టేయమంటారా...?" అని ప్రశ్నల వర్షం కుర్పించాడు.

"కాదురా! ఆ బండి ఇంకా అక్కడకి జేరలేదుకానీ, బైట మీ తమ్ముడున్నాడా? ఉంటే వాడ్నిటు పిలు" అన్నాడు రామారావ్ తన యింటి తాళంచెవులు జేబులోంచి తీస్తూ!

"ఏంది మాష్టారూ!..." అంటూ లోపలకు వచ్చిన సోములు తమ్ముడికి తాళం చెవులిచ్చి, తన యింట్లో ఉన్న పాలడబ్బా ఎక్కడుందో చెప్పి తీసుకురమ్మన్నాడు త్వరగా.

యిక్కడ సోముల్ని ట్రైన్ యింజన్ వద్దకి పంపి తన కెటిల్‌నిండా వేడినీళ్ళు తెప్పించాడు రామారావ్.

పాలపొడి డబ్బా, వేడినీళ్ళ కెటిల్ సోముల్ని తీసుకుని సతీష్‌తో పంపి; త్వరగా తిరిగి రమ్మన్నాడు.

రాణికి అవి అందించి సతీష్ త్వరగా పాలు కలపమని చెప్పబోతూంటే సోములు తిరిగి



# ఛార్జ్ షీట్

రామారావ్ పిలుపు విని వెనక్కి పరిగెత్తాడు.

రామారావ్ అందించిన 'లైన్ క్లియర్' తీసుకువెళ్తున్న సోముల్ని చూసి సతీష్ వేణ్ణీళ్ళు ఫ్లాస్క్‌లో నింపి, పాలపొడి కొంచెం గ్లాస్‌లో వేసి అవి రామారావ్‌కి అప్పజెప్పడానికి వచ్చాడు.

"మీరు మళ్ళీ యిలా వచ్చారు; మీ బండి కదలబోతోంది" అన్నాడు రామారావ్.

సతీష్ ఆ పాలడబ్బా, కెటిల్ రామారావ్‌కి ఇచ్చేసి తన కృతజ్ఞతలు మాటల్లో వ్యక్తపరుద్దామని –

"మీ పేరు చెప్పారు కాదు" అన్నాడు.

"మీ బండి కదిలిపోతోంది మీరు ముందెక్కండి. నా పేరుదేముందిలెండి" అంటూ రామారావ్ స్టేషన్ లోపలకువెళ్ళాడు ఫోన్ అటెండ్ అవడానికి.

గార్డ్ చూపే పచ్చజండా చూస్తూ కదలుతున్న ఆ బండి ఎక్కాడు సతీష్ ఆ స్టేషన్ పేరూ, ఆ మాస్టర్ రూపం మనస్సులోనే తలచుకొంటూ.

బెర్త్ మీద పాప ప్రశాంతంగా పాలు తాగుతూ నిద్రకుపక్రమించింది.

సతీష్ తన ఊరు చేరినా ఆ స్టేషన్ మాస్టర్ చేసిన సహాయానికి ఏ విధంగా కృతజ్ఞత తెలియజేస్తే బాగుంటుంది! అని ఆలోచించాడు.

అప్పుడు గుర్తుకు వచ్చిందతనికి, ప్రతి రైల్వేలోనూ ఒక సూచన – ఫిర్యాదుల విభాగం పని చేస్తోందనీ; వారికి రాస్తే తన అభినందనలు ఆఫీస్ ద్వారా ఆ స్టేషన్ మాస్టరు కందుతాయనీను.

వెంటనే లెటర్‌పాడ్ తీసుకుని తన ప్రయాణం వివరాలు; ఎడారిలాంటి ఆ స్టేషనూ; దాని పేరూ, బండి నెంబరూ, తేదీ రాస్తూ ఆ రైల్వే అధికారులకి –

"ఆ స్టేషన్ మాస్టర్ చేసిన సకాల సహాయానికి తన ధన్యవాదాలు స్వయంగా చెప్పడాన్కి అవకాశం కుదరలేదనీ, ఉత్తరం ద్వారా తెలియజేయడాన్కి ఆయన తన పేరు ఇవ్వనిరాకరించారనీ, అందుచే మీ ఆఫీస్ ద్వారా తన కృతజ్ఞతలు ఆ స్టేషన్ మాస్టర్‌కు అందజేయమనీ" విన్నవించుకొన్నాడు తన లేఖలో.

సతీష్ ఉత్తరం ఆ రైల్వే ఆఫీస్‌లో సూచనలు–ఫిర్యాదుల కార్యాలయానికి చెందిన గుమాస్తాల చేతుల్లోనే పడింది. అందునా సీనియర్ క్లర్క్ సీతాపతికి చిక్కిందీ ... అంటే ఇంక వేరే ఏముందీ ... ?

సీతాపతికి ఆఫీస్‌కి వచ్చే ఉత్తరాల్లోని పదాల్లో ఎప్పుడూ ఏవో కొత్త అర్థాలు వెదికిపట్టడం మా గొప్ప సర్దా! అందులోనూ తన సహచరుల లోటుపాట్లను వెతకడం; మంచినికూడా మరో దృష్టితో చదవడం వెన్నతో పెట్టిన విద్య. చేతిలోని సతీష్ ఉత్తరంలో –

"ఆ స్టేషన్ మాస్టర్ తన పేరు ఇవ్వ నిరాకరించారని" అన్నది మాత్రం మరో పుంజీడుసార్లు చదువుకొని సాపేక్షగా నవ్వుకొని, తన ప్రజ్ఞా పాటవాలు వెల్లడించడానికా అన్నట్లు –

"రైల్వే కాండక్ట్ రూల్స్ ప్రకారం ఎవరు, ఎప్పుడు అడిగినా రైల్వే ఉద్యోగి తన పేరు, ఉద్యోగం ఎల్లప్పుడూ తెలియజేయాలనీ; ఈ సత్యాపురం స్టేషన్ మాస్టర్ ఈ విషయంలో తన పేరు సతీష్‌గార్కి చెప్ప నిరాకరించాడనీ; అందుచేత కాండక్ట్ రూల్స్‌కు వ్యతిరేకంగా నడచినట్లయిందనీ, దానికి ఆ స్టేషన్ మాస్టర్‌ను ఛార్జ్‌షీట్ చేయవచ్చనీ..." రిమార్క్ వ్రాసి,

తన పై అధికారికి ఆ లేఖ అందజేయడం, ఆ అధికారి – "ప్రొసీడ్" – అని సంతకం చేయడం క్షణాలమీద జరిగాయి.

మరే విన్నపమో అయితే ఆ ఆఫీస్ నుంచి వచ్చే జవాబు కోసం చకోరంలా ఎదురు చూడవలసిందే. కానీ సతీష్ ఉత్తరం అదృష్టమా అన్నట్లు అతనికి, ఆ రైల్వే ఆఫీస్ నుండి –

"మీకు కల్గిన ఈ అసౌకర్యంకు చాలా చింతిస్తున్నాం. దీనికి కారకులైన వారిపై తగు చర్య తీసుకోబడుతుంది" – అన్న జవాబు చూసిన సతీష్‌కు రైల్వేవాళ్ళ ప్రాంప్ట్ రిప్లైకి, సూక్ష్మబుద్ధికి, వ్యవహార దక్షతకూ నవ్వాలో, ఏడ్వాలో అర్థం కాలేదు.

ఇక్కడ –

దాదాపు అదే పరిస్థితిలో ఉన్న రామారావ్ చేతిలో గాలికి రెపరెపలాడుతున్న ఆ 'ఛార్జ్‌షీట్'కి ఏ విధంగా జవాబివ్వాలా అని ఆలోచిస్తూ భారంగా నిట్టూర్చాడు!

... అవినీతికీ, ఆశ్రిత పక్షపాతానికీ ఆలవాలమైన పాలనా యంత్రాంగం లాంటి దట్టమైన కారుమబ్బులు దూరంగా కొండ మీద వెల్లివిరిసిన పచ్చదనాన్ని కబళించడానికి తరుముకొస్తున్నాయి. 




# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు




ఐటెక్స్ 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600 033



'నాయుడుగారబ్బాయి'లో అంబిక

## విశ్వచిత్ర పిపి ఎంటర్‌ప్రైసెస్ వారి ద్వితీయ చిత్రం

"అక్టోబర్, డిసెంబర్, జనవరి మాసాల్లో షెడ్యూల్స్ ప్లాన్ చేశాం," అన్నారు జి. ఆర్. కె. రాజు "టాక్సీ డ్రయివర్" అనంతరం ఈయన నిర్మించే కొత్త చిత్రంలో కృష్ణంరాజు హీరో. దాసరి కథకుడు. ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

# సినిమా

—జి.వి.జి.

## విప్లవ శంఖం

"విశ్వశాంతి యు. విశ్వేశ్వరరావుగారి దర్శక పర్యవేక్షణలో ఆగస్టు 15 నుంచి నెలాఖరులోగా పాటలన్నీ రికార్డు చేస్తాం," అన్నారు మాదాల రంగారావు ఈయన యువతరం పిక్చర్స్ "విప్లవ శంఖం" చిత్రానికి కథకుడు, నిర్మాణ సారథి. "నా బాల్యమిత్రుడు, రంగస్థల ప్రయోక్త, నేను సినీ నటుడవడానికి నన్ను మద్రాసు పంపి నాకు కొండంత అండగా నిలబడి, 'ఎర్రమల్లెలు' చిత్రంలో పాలేరు పాత్రను ధరించిన టంగుటూరు టి. కృష్ణ ఈ చిత్రానికి ఒక నిర్మాత. ఎన్నో ఏళ్ళుగా ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా, నేనిదివరకు నిర్మించిన రెండు చిత్రాలకు నిర్వాహకుడుగా నాకు చేదోడు వాదోడుగా ఉన్న కె. రాధాకృష్ణమూర్తి మరో నిర్మాత," అని మాదాల రంగారావు తెలియజేశారు. శ్రీశ్రీ, అదృష్టదీపక్ గీతాలకు చక్రవర్తి సంగీత దర్శకుడు. రామారావు ఛాయాగ్రాహకుడు

'తల్లీ కొడుకుల అనుబంధం'లో కృష్ణంరాజు, జ్యోతిలక్ష్మి



'బంగారు కొడుకు'లో శ్రీదేవి

## శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

"ఎ. కోదండరామిరెడ్డి డైరెక్షన్‌లో అక్టోబర్‌లో కొత్త చిత్రాన్ని మొదలెట్టాను," అన్నారు నిర్మాత మిద్దె రామారావు. తోటకూర ఆశాలత రచన, చక్రవర్తి సంగీతంతో డిసెంబర్‌కు పూర్తవుతుంది. ఫిబ్రవరిలో ఈ చిత్రాన్ని విడుదల చేసి, ఏప్రిల్‌లో మరో చిత్రాన్ని ప్రారంభిస్తారు.

స్క్రీన్‌ప్లే-పర్యవేక్షణ: దాసరి నారాయణరావు

గంగాధర



SREE PUBS

రాజలక్ష్మి కంబైన్స్

# నేను మా ఆవిడ

ఈస్ట్‌మన్ కలర్

లక్ష్మీచిత్ర

రిలీజ్:
స్వర్ణయుగ
నైజాం:
ఉషా ఫిలింస్

నిర్మాత
యు.యస్.ఆర్. మోహనరావు

దర్శకత్వం:
రేలంగి నరసింహారావు

## ఘరానా గంగులులో చిక్కులో పడ్డ సూరిబాబు

సూరిబాబు (నూతన్‌ప్రసాద్) వద్ద తలమాసె సీసాలు కొన్నవారందరికీ జుట్టు పెరక్కపోగా ఉన్న జుత్తు కూడా ఊడిపోయింది. వాళ్ళంతా సూరిబాబు ఇంటికి వెళ్ళి కొట్టబోతే, అతను కత్తితో బెదిరించి, పారిపోయివచ్చి జానీ (కవిత) ఇంట్లో దూరాడు. చేతిలో ఉన్న కత్తి చూపిస్తూ, "అరవకు! ఇది మామూలు కత్తి అనుకుంటున్నావేమో! వీరపాండ్యకట్టబ్రహ్మన దీనితోనే యుద్ధం చేశాడు. ఇప్పుడే ఒకడ్ని డబల్ మర్డర్ చేసివస్తున్నాను. హహ్హహ్హ!" అన్నాడు సూరిబాబు

"ఏయ్! వేళాకోళంగా ఉందా?" అంది జానీ.

"వేళాకోళం శ్రీకాకోళం అన్నావో నిజంగానే నిన్నూ మర్డర్ చేసేస్తాను. ఊఁ! నన్ను కొంత మంది రౌడీలు తరుముకొస్తున్నారు. కాసేపు నువ్వు నాకు మొగుడిగా ...ఛీ ఛీ...నేను నీకు పెళ్ళాంగా... ఛీ ఛీఛీ ... నువ్వు నాకు పెళ్ళాంగా నటించి నన్ను రక్షించుకో ... ఓన్లీ త్రీ మినిట్స్ నటించు ..." అంటూ సూరిబాబు పక్కనున్న మంచంమీద ముసుగు బిగదన్ని పడుకున్నాడు.

ఇంతలో జనం లోపలికి బిలబిలమంటూ ప్రవేశించారు. ఒకడు "ఏమ్మా, ఎవరన్నా ఒక వ్యక్తి కత్తి పట్టుకొని లోపలికి వచ్చాడా?" అన్నాడు.

"ఏమయ్యా, మీకసలు బుర్రుందా? భార్యాభర్తలు పడుకునే గదిలోకి వచ్చి, వాడొచ్చాడా — వీడొచ్చాడా అని అడ్డమైన ప్రశ్నలు వేస్తారా? అసలే మా వారికి ఒంట్లో బాగోలేదు," అంది జానీ.

దుప్పటి ముసుగులోంచి సూరిబాబు "మరే... బాగోలేదు. హమ్మా...హమ్మయ్యా! నే బతకను... చచ్చిపోతాను ..." అని మూల్గాడు. జానీ ఎలుగెత్తి, "ఏవండ్యూ! నా బాధలో పడి నేనేడుస్తూంటే, మధ్యలో మీరేమిటి ఇలా వచ్చారు? మర్యాదగా వెళ్తారా — లేకపోతే మా సెక్రెటరీతో చెప్పి పోలీసులకు ఫోన్ చేయించమంటారా?" అంది.

"అయ్యయ్యో, వద్దమ్మా. వెళ్ళిపోతాంగా? పదండిరా పదండి," అంటూ జనం వెళ్ళిపోయారు

"వాళ్ళంతా పూర్తిగా వెళ్ళిపోయారా?" అంటూ సూరిబాబు దుప్పటి తీసేసి, మంచంమీద నుంచి దిగాడు.

"ఏయ్, మిస్టర్! మూడు నిమిషాలు భార్యగా నటించినందుకు నువ్వు నాకు చెయ్యవలసిన ప్రత్యుపకారమేమిటో తెలుసా? మూడు నెలలు మొగుడిగా నటించాలి," అంది జానీ.

"ఇదేం విడ్డూరం? నువ్వు నాతో మూడు నిమిషాలు నటించినందుకు కావాలంటే ఆరు నిమిషాలు నటిస్తాను."

"అదేం కుదరదు! నిన్ను అడ్డం పెట్టుకొని నేను ఎన్నో పనులు నెరవేర్చుకోవాలి. దొంగతనం చెయ్యాలి."

"ఇదెక్కడి గొడవ, స్వామీ! ఇరుక్కుపోయాను. వాళ్ళకి దొరికినా బాగుండేది. కాలో చెయ్యో తీసి వదిలేసేవాళ్ళు. ఇప్పుడు పీకమీదే పెట్టింది కత్తి!"

"చూడు — ఈ మూడు నెలల్లోగా ఎప్పుడైనా పారిపోటానికి ప్రయత్నించావో — పోలీసులకు నన్ను బలాత్కరించావని చెప్తాను. ఆ తర్వాత దేవుడు కూడా నిన్ను రక్షించలేడు," అంది జానీ.

సూరిబాబు ఏడ్పుముఖం పెట్టాడు.

శోభన్‌బాబు, శ్రీదేవి నాయకా నాయికలుగా కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ. పోతరాజు నిర్మించే సరిగమ ప్రొడక్షన్స్ "ఘరానా గంగులు" చిత్రం విడుదలకు సిద్ధమౌతోంది.



'ప్రేమ నక్షత్రం'లో శ్రీదేవి

## సినిమా

'శ్రీరస్తు—శుభమస్తు'లో చిరంజీవి, సరిత

స్వాతంత్ర్య సమర వీరులారా మీ త్యాగాల
వెలుగు ఆగదు! మరింతగా ప్రజ్వరిల్లి
స్వతంత్ర భారత పౌరుల్ని పీడిస్తున్న
స్వార్థపరుల్ని తుదముట్టిస్తుంది.

చరిత చిత్ర కంబైన్స్

# మహా కురుక్షేత్రం



నిర్మాత: తమ్మారెడ్డి వి.కె. * దర్శకత్వం: లెనిన్

రిలీజ్: నవయుగ పిక్చర్స్

# మారాం చేసేవారిని కూడా మైమరిపించే ప్రియ








'ప్రియ' ఆకర్షణలో పడనివారు లేరు. మూత తీసి తియ్యటంతోనే ఎన్నెన్నో రుచులూరిస్తుంది 'ప్రియ'. ఆకలి లేదని మారాంచేసే పిల్లలు కూడా 'ప్రియ' పచ్చళ్లు ఉంటే ఆప్యాయంగా తింటారు.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

• మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో
• అల్లం • గోంగూర • ఉసిరికాయ
• చింతకాయ • పండు మిరపకాయ • వంకాయ

తీపిరకాలు : • మామిడికాయ • అల్లం

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.

KIRON/PF/81.1.TEL

# థియేటర్లు

★ మన దేశంలో తొలి టాకీ థియేటర్ 'ఎలిఫిన్‌స్టన్ పిక్చర్ పాలెస్' కలకత్తా (1929)

★ దక్షిణ భారతంలో మొట్టమొదటి ఏర్ కండిషన్డ్ థియేటర్ 'మినర్వా టాకీస్' మద్రాసు (1949). దీని స్థాపకులు స్వర్గీయ సి. పుల్లయ్య.

★ మన దేశంలో 9,951 సినిమా ప్రదర్శనశాలలున్నాయి. ప్రతిరోజూ దాదాపు 12 లక్షల మంది సినిమాలు చూస్తారు.

★ ప్రపంచంలో ఎక్కువ సినిమా థియేటర్‌లు ఉన్న దేశం రష్యా. 1974 లోనే 16. ఎం. ఎం. థియేటర్లతో కలిసి మొత్తం 1 లక్ష 63 వేల థియేటర్లు ఉన్నాయట.

★ ప్రపంచంలోకెల్లా పెద్ద సినిమా థియేటర్ న్యూయార్క్‌లోని "రేడియో సిటీ మ్యూజిక్ హాల్". 5882 సీట్లున్నాయి. ఇది 1932 డిసెంబర్ 27న ప్రారంభించబడింది. అంతకు ముందు 1927 మార్చి 11న ప్రారంభోత్సవం జరిగిన 6214 సీట్లు గల "ది రాక్సీ" థియేటర్ 1960 మార్చి 29న మూసివేయబడింది.

★ పెద్ద ఓపన్ ఏర్ థియేటర్ పశ్చిమ బెర్లిన్‌లో ఉంది. 22 వేల మంది ప్రేక్షకులు ఒకేసారి చూడవచ్చు.

★ పెద్ద 'డ్రయివ్ ఇన్' థియేటర్ అమెరికాలోని కనెక్టికట్లో (న్యూ ఇంగ్టన్). 4 వేల కార్లలో కూర్చొని దర్శించడానికి వసతి గల థియేటర్.

★ అతి పురాతన థియేటర్ అమెరికా జార్జియానాలో ఉంది. ఇది 1895 లో నిర్మించబడింది.

★ గొప్ప సినిమా తెర ఉన్న థియేటర్ కాలిఫోర్నియా (సాండాక్లారా)లోని "పిక్టోరియల్ థియేటర్". 70 అడుగుల నిడివి, 90 అడుగుల వెడల్పు గల స్క్రీన్. 1978 మే 16న ప్రారంభించబడింది.

★ చాలా తక్కువ థియేటర్లు ఉన్న దేశం సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్.

★ పశ్చిమ బెంగాల్ డైరెక్టరేట్ ఆఫ్ కాటేజ్ అండ్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రీచేత కుటీరపరిశ్రమ కింద రిజిస్టర్ చేయబడిన తొలి థియేటర్ కలకత్తాలోని మెజెస్టిక్ సినిమా.

## చిత్రాల పేర్లు

కృష్ణంరాజుతో కొమ్మినేని శేషగిరిరావు దర్శకత్వంలో వై. వి. రావ్ నిర్మించే రవి చిత్ర ఫిలిమ్స్ 12వ చిత్రం పేరు "నిప్పుతో చెలగాటం".

హీరో నారాయణరావుతో ధవళ సత్యం దర్శకత్వంలో పి. జె. బెనర్జీ నిర్మించే పి. శ్రీనివాసరావు సన్స్ చిత్రం పేరు "సుబ్బారావుకి కోపం వచ్చింది".

# సినిమా

## సుబ్బారావుకి కోపం వచ్చింది

సుబ్బారావు (నారాయణరావు) రేషన్ ఆఫీసుకు వెళ్ళాడు. "ఏమండీ, రేషన్ కార్డ్ అప్లికేషన్ ఫారమ్ ఒకటిస్తారా ?" అని అడిగాడు.

"మీ పేరు ?" అడిగాడు గుమాస్తా.

"సుబ్బారావండి."

"మీదే ఊరు ?"

"ఈ ఊరేనండి."

"ఏం చేస్తున్నారు ?"

"భారత్ స్పిన్నింగ్ మిల్స్‌లో వర్క్ చేస్తున్నానండి."

"జీతం ఎంత ?"

"నాలుగు వందల రూపాయలండి"

"ఏ వార్డు ?"

"21వ వార్డు."

"ఏ వీధి ?"

"వీరావారి వీధండి."

"డోర్ నెంబర్ ?"

"8–6–336."

"ఓటు ఉందా ?"

"ఉందండి."

"ఇంతకు ముందు కార్డు ఉందా ?"

"లేదండి."

"ఎందుకు లేదు ?"

"అవసరం లేకపోయిందండి. మా ఫామిలీ ఈమధ్య వచ్చారండి. అందుకని ..."

"యు ఆర్ మేరీడ్ ?"

"అవునండి."

"ఎంతమంది పెళ్ళాలు...ఐ మీన్—పిల్లలు?"

"ఇంక లేరండి."

"ఎందుచేత ?"



'సుబ్బారావుకి కోపం వచ్చింది'లో మేనక

"అవన్నీ మీకెందుకండీ? అప్లికేషన్ ఉందో లేదో చెప్పండి."

"ఏ అప్లికేషన్ ?"

"రేషన్‌కార్డు అప్లికేషనండి."

"అవి ప్రింట్ అవడంలేదు."

"ఆ మాట ముందే చెప్పొచ్చు కదండీ ? ... నస !" అంటూ సుబ్బారావు తీక్షణంగా చూసి, విసురుగా వెళ్ళిపోయాడు. ధవళ సత్యం స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో పి. జె. బెనర్జీ నిర్మించిన పి. శ్రీనివాసరావు సన్స్ "సుబ్బారావుకి కోపం వచ్చింది" చిత్రానికి మూలకథను డూండీ, కథారచనను రామలక్ష్మి, సంగీతాన్ని సత్యం, ఛాయను ఉదయరాజ్ సమకూర్చారు. పి. ప్రేంకుమార్ సహ నిర్మాత

'స్వయంవరం'లో శోభన్‌బాబు, జయప్రద





'తీర్థ యాత్ర'లో రూప, సత్యేంద్రకుమార్

# సినిమా

## బంగారు భూమిలో పక్కలో బల్లెం

ఆఫీసు గది హెచ్. సి. రావ్ (ప్రభాకర్) ఫోన్ చేయబోతూ గది మూలనుంచి పొగ రావడం చూసి ఉలిక్కిపడ్డాడు. "ఎవరది ?"

బీడీ దమ్ము గట్టిగా లాగి, పీకను అవతల పారేస్తూ, "బాంచోణ్ణి, బిడ్డా !" అంటూ దగ్గరగా వచ్చాడు కపాలి (త్యాగరాజు).

"జైలు నుండి ఎప్పుడొచ్చావ్ ?"

"నీ యవ్వ... ఎప్పుడొ వస్తే — నీకాడ కిప్పుడొస్తావా ? జైలు బయటపడగానే మొదట నీకాడ, రెండోది నా బిడ్డకాడ అడుగు వెయ్యటం -- అని నీకు తెలుసు."

"మళ్ళీ మూడో అడుగు జైల్లోకి."

"తప్పనిసరైతే అంతే మరి... తొందరగెల్లి నా కూతుర్ని చూసుకోవాలి. నా మామూలు పడేయ్, బిడ్డా !"

"మామూలు — మామూలు... ఎన్నాళ్ళీ మామూలు ?" రావ్ నొసలు చిట్లించాడు.

"అంతేగా బిడ్డా ! అయినా, నెత్తుటి కూడు ఒక్కడే తినకూడదు, బిడ్డా ! తోడున్నవాడికి కూడా కాస్త పంచాడివ్వాలి."

"సరే... ఈ పదివేలు తీసుకుపో !"

"పుండుకు పుల్ల తప్పదు... నీకు నేను తప్పను, బిడ్డా ! వస్తా !" విషపునవ్వు విరజిమ్ముతూ వెళ్ళాడు కపాలి.

రావ్ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

కృష్ణ హీరోగా ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించే మహేశ్వరీ మూవీస్ "బంగారు భూమి" చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## అభినయ ఆర్ట్ క్రియేషన్స్

"మాకు నాటక రంగంలోనూ, చిత్ర ప్రదర్శన రంగంలోనూ అనుభవముంది. ఒక చిత్రం తీయాలనే సంకల్పం కలిగింది. కాని, చిత్ర నిర్మాణ రంగం మహా సముద్రమని మాకు తెలుసు. అంచేత, వాలుగ్గా దేళ్ళుగా నథకాలు వేసుకొని, ఇప్పుడు చిత్ర నిర్మాణానికి ఉప్రకమించాం," అన్నారు అభినయ ఆర్ట్ క్రియేషన్స్ అధినేతలు జాగర్లమూడి ఆదినారాయణరావు, బి.ఎ., బి.ఇ., రావి అంజనేయులు, బి.ఎస్.సి. ఈ చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం నెఱపే ఎమ్. రవీంద్రరెడ్డి "నేను నాటకాలకు దర్శకత్వం వహించాను. అందుకే ఈ చిత్రానికి దర్శకత్వం వహించే ముందు దాసరిగారి శిష్యుడైన రాజాచంద్రగారి వద్ద శిష్యరికం చేసి, అనుభవం గడించాను. భీమ్‌సింగ్‌గారు 1963 లో తీసిన 'పార్ మగళే పార్' అనే కుటుంబగాథా చిత్రం మా అందరికీ ఎంతో నచ్చింది. దాని హక్కులు కొని, నేటి కాలానికి, ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా చేర్పులు, మార్పులు చేశాం. హీరో శోభన్‌బాబుగారిని కలిసినప్పుడు నేను చిత్ర దర్శకత్వానికి కొత్తవాడ్నయినా — ఆయన భుజం తట్టి ప్రోత్సహించారు. ఆ ఉత్సాహంతో ముందంజ వేస్తున్నాం," అన్నారు ఈ చిత్రంలో శోభన్‌బాబు, సుజాత, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, జె. వి. రమణమూర్తి తెరముందు; జంధ్యాల, చక్రవర్తి, వెంకట్, కందస్వామి, రమణ — మోహన్, ఎస్ పి. రంగారావు తెరవెనుక కృషి చేస్తారు "నవంబర్ 2న షూటింగ్ మొదలెట్టి, మార్చిలో విడుదల చేస్తాం," అని ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ బొక్కసం ఆంజనేయులు తెలియజేశారు



'నాంపల్లి నాగు'లో ఒక సన్నివేశం.

## "పెళ్ళిళ్ళ పేరయ్య"

"శోభన్‌బాబు పక్కన కొత్త హీరోయిన్‌ను పరిచయం చేయాలనుకుంటున్నాం," అన్నారు కొమ్మినేని శేషగిరిరావు. ఈయన దర్శకత్వంలో టి. భద్రయ్య, టి. రాజమౌళి నిర్మించే శాయికృష్ణ ఎంటర్‌ప్రైసెస్‌వారి పై హాస్య ప్రధాన చిత్రానికి గొల్లపూడి మాటలు, చక్రవర్తి సంగీతం సమకూర్చుతారు. వి. కేదారేశ్వరరావు నిర్మాణ నిర్వహణలో నవంబర్‌లో సెట్స్‌కు వెళ్ళే ఈ చిత్రాన్ని దొనపల్లి బాబూరావు సమర్పిస్తారు.

## వివేకా ఫైన్ ఆర్ట్స్ ద్వితీయ చిత్రం

"జనవరి 14న — మా హీరో శోభన్‌బాబు పుట్టిన రోజున కొత్త చిత్రాన్ని ప్రారంభిస్తున్నాం," అన్నారు జ్యోతి కుమారస్వామి. ఈయన, జి గోపిమురలి "జీవితరథం" అనంతరం నిర్మించే రెండవ చిత్రంలో సుమలత నాయిక. వి. మధుసూదన రావు దర్శకుడు.

# జలుబు లక్షణాలలో మిమ్మల్ని పెడుతూన్నది ఏది?

తలనొప్పి/ ఒంటినొప్పి

ముక్కు దిబ్బడవెయ్యడం

గొంతు నొప్పి

## జలుబూ, రొంపావల్ల వచ్చే అస్వస్థతలన్నిటి కోసం తీసుకోండి

# డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500

జలుబు పట్టిందంటే ఒకటి కాదు పది చికాకులు. మీరిక నీరస పడిపోతారు. డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500 ఒక్క మాత్రలో, ప్రభావంగల, జలుబునుంచి ఉపశమనం యిచ్చే పదార్థాలన్నీ కలిసి వున్నాయి. మీకు పట్టిన జలుబునుంచి ఉపశమనం యిస్తూనే, మీరిక మునవటిలాగే చురుకుగా వుండగలుగుతారు. డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500 లోగల అద్వితీయమైన 4-రకాల చర్య. రొంపా, జలుబూ, దాని లక్షణాలన్నిటి నుంచీ సత్వరంగా, ప్రభావ పూరితమైన ఉపశమనాన్నిస్తుంది.




1. జలుబువల్ల వచ్చే తలనొప్పీ. వంటినొప్పి నుంచీ ఉపశమనం.
2. ముక్కు దిబ్బడ వెయ్యడంనుంచి ఉపశమనం.
3. గొంతు గరగర లాడటం, గొంతు నొప్పిమంచి ఉపశమనం.
4. జలుబువల్ల వచ్చే జ్వరమూ మరియు ప్లూని అదుపులో పెడుతుంది.

**డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500 జలుబు నుంచి ఉపశమనం యిస్తూనే మిమ్మల్ని చురుకుగా ఉంచుతుంది.**

OBM/7004 TL



'పెళ్ళి పిలిచింది'లో జ్యోతి

# సినిమా

## విశ్వప్రశాంత్ మూవీస్ విప్పురుగప్పిన నిప్పు

కృష్ణ, శివాజీగణేశన్, జయప్రద, జయలక్ష్మి, షావుకారు జానకి, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, నాగేష్, అల్లు రామలింగయ్య, గిరిజ, శ్రీలక్ష్మి ముఖ్య భూమికలు ధరించిన విశ్వప్రశాంత్ మూవీస్‌వారి చిత్రానికి "నివురుగప్పిన నిప్పు" అని పేరు పెట్టినట్లు నిర్మాత అడుసుమిల్లి లక్ష్మీకుమార్ తెలియజేశారు. భమిడిపాటి రాధాకృష్ణ మాటలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, వెంకట్ ఛాయలో కె. బాపయ్య దర్శకుడు.

## విరాణి ఎంటర్‌ప్రైజెస్ చిత్రం

"రెండవ షెడ్యూల్ ఆగస్టు 14 నుంచి 23 వరకు అన్నపూర్ణా స్టూడియోస్‌లో జరుగుతుంది," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం వహిస్తూ సమర్పించే ఈ చిత్రంలో ఎ.ఎన్.ఆర్., జయసుధ, లక్ష్మి, నిర్మల, రావు గోపాలరావు ప్రభృతులున్నారు. చక్రవర్తి సంగీతం, సెల్వరాజ్ ఛాయ, భాస్కరరాజు శిల్పంతో కొడాలి బోసుబాబు నిర్మాత.

## రిజిస్టరైన చిత్రాల పేర్లు

జీసస్ ఫిలిమ్స్ "దేవదాసి", "ప్రేమకు మరణం లేదు", జి.వి.కె. ప్రొడక్షన్స్ "రౌడీ మామూలు", శ్రీ రత్నా ఇంటర్నేషనల్ "హనీమూన్", జె.జె. ఆర్ట్స్ "అకాల వసంతం", ఊర్మిళా పిక్చర్స్ "మహా పతివ్రత", జనని సినీ ప్రొడక్షన్స్ "శ్రీ శివకుమార సంభవం", కమలాలయా క్రియేషన్స్ "కాశీ అన్నపూర్ణ", ఆచార్య పిక్చర్స్ "ఆదది ఒక గాజుబొమ్మ", మిత్రా ప్రొడక్షన్స్ "మరో సీతారామరాజు", శ్రీ దాక్షాయణీ క్రియేషన్స్ "కయ్యాల అమ్మాయి — కలవారి అబ్బాయి", వి.ఎస్. ఆర్. ఫిలిమ్స్ "పెళ్ళి ముహూర్తం", చక్రవర్తి ఆర్ట్స్ క్రియేషన్స్ "పున్నమి తరంగాలు", శ్రీ కృష్ణా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "ప్రతి ఊరి కథ", సినీరమా వారి "మంచు కొండలు", బాలాజీ ఆర్ట్స్ "మా ఊరి పెద్ద మనుష్యులు", విజయజ్యోతి ఆర్ట్ పిక్చర్స్ "అందమైన అమ్మాయిలు", శ్రీకర్ ప్రొడక్షన్స్ "శపథం", లక్ష్మి ప్రొడక్షన్స్ "ఉద్దండుడు", శ్రీ శ్రీసత్య ఫైన్ ఆర్ట్స్ "కృష్ణప్రియ", రాజలక్ష్మి కంబైన్స్ "ఏవండోయ్ శ్రీమతిగారూ!"

## అభినయ ఆర్ట్స్

రవీందర్‌రెడ్డి దర్శకత్వంలో తయారయ్యే చిత్రంలో శోభన్‌బాబు సరసన శారద, లక్ష్మి నాయికలు.






చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

**1 రూపాయికి 10***

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-238-234 TI

మెయిన్ డీలరు : మెస్సర్స్ శ్రీ సత్యనారాయణ ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ-520001.

సీరియల్

# నర్సింగ్‌హోం

శ్రీరంగం

శేఖర్ విశ్వం నర్సింగ్‌హోంకి రెండు రోజులనించీ వస్తున్నాడు. అతను అందులో పద్ధతులకు అలవాటు పడిపోతున్నాడు. రోజూ వొకటేన్నరకు వస్తే ఆరేషన్లన్నీ పూర్తి అయేటప్పటికి ఏ ఆరో అయేది. శేఖర్ అండ చూసి విశ్వం విరివిగా ఆపరేషన్లన్నీ బుక్ చేస్తున్నాడు. మూడోరోజు శేఖర్ అనుకున్నాడు — ఇతను యిలా ఆపరేషన్లు బుక్ చేస్తూంటే — యీ చిన్న నర్సింగ్‌హోం అతనికి సరిపోదని, ఇంకో ఇరవై అయిదు బెడ్లు వేస్తేనేగాని యీ రష్‌కు తట్టుకోలేదని. తన యీ ఆలోచన విశ్వంతో చెబుతూ "సార్ మీరు ఇంకొన్ని బెడ్లు వేస్తే సార్" అన్నాడు.

"నాకూ వెయ్యాలనే ఉంది. కాని ఈ కాలంలో కట్టించడంలో బాధలు మనం పడలేం. డబ్బు ఖర్చు పెట్టినా పని జరగనిరోజులు యివి."

"సార్ మీరు పెద్దఎత్తున తలపెట్టకండి. ఇంకో ముప్పై గదులు విత్ అటాచ్‌డ్ బాత్ రూమ్స్ కట్టాలంటే కష్టంగాని ఒక పెద్దగది జనరల్ వార్డ్ లాంటిది కట్టేస్తే అందులో ..."

"ఆ విషయం గురించి వొకసారి ఆలోచించేను. మనం జనరల్ వార్డులాంటిది వేసి అందులో వొక ఇరవై బెడ్లు వేసేం అనుకో, అప్పుడు బెడ్‌కి ఎంత తీసుకోవచ్చు అంటావు. ఒక అయిదో పదో! అంతకంటే ఎక్కువ తీసుకోలేం కదా? ఈ అయిదుకో పదికో వాళ్లకి ఎన్ని సౌకర్యాలు కల్గించగలం మనం. ఏమీ కల్గించలేం. అసలు మన దగ్గిరికి వచ్చేవాళ్లకు ప్రత్యేకంగా గది అటాచ్‌డ్ బాత్ రూంతో కావాలంటారు. అందులో మల్లెపువ్వు లాంటి బెడ్ ఉండాలంటారు. అక్కడనించి బటన్ నొక్కగానే ఏ నర్సో, ఏ అటెండెంటో కనపడాలంటారు. మన ట్రీట్‌మెంటుకి కాదు వాళ్లు డబ్బిస్తూంది, ఈ ప్రత్యేక సదుపాయాల గురించి. ఇవే లేకపోతే మేం ఆసుపత్రికే పోయేవాళ్లం అంటారు. అందుకే జనరల్ వార్డు అంటూ లాభంలేదు. మన గదులు ఫైవ్ స్టార్ హోటల్ రూంలో గదుల్లా ఉండాలి.

ఇంకో సంగతి! ఇక్కడ పేషంట్లు జాయిన్ అయేది సాధారణంగా డాక్టర్ గురించి కాదు. ప్రాముఖ్యత గురించి. ఎవరైనా 'మీరు ఎక్కడ ఉన్నారు' అంటే విశ్వం నర్సింగ్‌హోంలో అని చెబితే వాళ్ల హోదా పెరుగుతుంది. అలాంటప్పుడు మనం గవర్నమెంటు ఆసుపత్రిలా వాళ్లను జనరల్ వార్డులో ఉంచుతామంటే ఉంటారా చెప్పు?"

శేఖర్ ఆశ్చర్యపోతూ "సార్! ఇదంతా ఇంత వ్యాపారం సరళిక్రింద తయారయిందా!!!" అంటూ

## (గత సంచిక తరువాయి)

అడిగేడు.

"అవునోయ్! చాలా విచారకరమైన సంగతి ఇది. ఒకప్పుడు నోబిల్‌ప్రొఫెషన్‌గా పరిగణింపబడే వృత్తి ఈ రోజు ఇదీ వొక వ్యాపారం అయిపోయింది. ఒకప్పుడు డాక్టరు దగ్గిరికి వెళ్ళాలంటే ఎవరికేనా తను జబ్బుగా ఉన్నామేమో అని తెలిస్తే పరువు నష్టం అని తలపోసేవాళ్ళు. ఈ రోజు తమ జబ్బు గురించే కాదు. తాము వెళ్లే డాక్టరు గురించి కూడా ఘనంగా చెప్పుకుంటారు."

ఇంతలో "డాక్టరుగారూ! సీరియస్ కేసు" అంటూ పరిగెత్తుకుంటూ వచ్చేడు అటెండరు.

"ఏంటి?" అన్నాడు విశ్వం.

"ఎవరో మీ స్టూడెంటటసార్! వొళ్లంతా కాలిపోయింది. మీరు అర్జంటుగ రావాలి."

"ఎవరు?" అంటూ లేస్తూ బయటికి వచ్చేడు.

క్షణాలలో నర్సింగ్‌హోం గేటుతీసి పేషంటును లోనికి తెచ్చేరు. ఆ ముఖాన్ని చూస్తూనే షాక్ తిన్నాడు విశ్వం. ఆమె ఉమ. తన ప్రియాతి ప్రియమైన స్టూడెంట్. కాలేజీ మొత్తంలో అంత అందమైన పిల్ల అసలు లేనేలేదు. మనిషి మూర్ఛపోయే అందం ఆమెది. పాదాలనించి మెడదాకా తెల్లని షీట్‌తో కప్పబడి ఉంది. తన్ను చూస్తూనే "గుడ్ మార్నింగ్ సార్" అంది.

"గుడ్ మార్నింగ్" అని, "ఏంటి? ఉమా?" అన్నాడు.

"ఏంలేదు సార్! కొంచెం కాలింది."

"నిన్ను చూసి అయిదేళ్లయినా, నిన్నే చూసి నట్లుంది. అప్పటికి ఇప్పటికి వొక్కలాగే ఉన్నావు" అని, "ఎక్కడ కాలిందేమిటి?" అన్నాడు.

"షీట్‌తో కప్పేసుకున్నాను సార్, కాలిన భాగాన్ని" అంది చిరునవ్వు ముఖంతో ఉమ.

విశ్వం షీట్ కొంచెం మెడమీదనించి ఛాతీ మీదకు తీసేడు. ఛాతీ బొబ్బలతో భయంకరంగా ఉంది. ఇంకా క్రిందకు కడుపుమీదకు తీసేడు. రెండు చేతులూ మొత్తం కాలి వాచి దుక్కల్లా కనిపిస్తున్నాయి. కడుపూ కాలింది. ఇంకా క్రిందకు తీయలేకపోయేడు. "శేఖర్ మీరు కాళ్లూ, తొడలూ చూడండి" అన్నాడు కప్పివేస్తూ. శేఖర్ క్రిందినించి బెడ్‌షీట్‌ని తీసి చూసి, తిరిగి కప్పేస్తూ "క్రింద భాగం అంతా కాలిపోయింది సార్" అన్నాడు.

"మరి ఏపో?" అన్నాడు విశ్వం.

"అక్కడ చర్మం ఊడిపోయి మాంసం బయటికి వచ్చింది సార్" అంది ఉమ.

విశ్వం తనకళ్లని ఉమ ముఖంవైపు తిప్పేడు. తిరిగి అదే చిరునవ్వు. శేఖర్‌వైపు చూసేడు విశ్వం. శేఖర్ ఇది నిజం అని నమ్మలేకపోతున్నట్టు అతని ముఖమే చెబుతూంది.

విశ్వం 'ఇంపాజిబుల్' అని గొణుగుతూంటే "ఏం సార్! ఎంత శాతం? తొంభైయా?" అంది ఉమ.

విశ్వం మాట్లాడలేదు.

"సార్! నేను బ్రతకను అని మొరపెట్టినా ఎవరూ వినిపించుకోలేదు సార్. ఇంటిపక్కవాళ్లూ, బయటవాళ్లు కలిసి బలవంతంగా తెచ్చేరు సార్. ఎంత కాలినా నేనూ డాక్టర్నేకదా సార్. నా బర్న్స్ గురించి నాకు తెలియదా? నన్ను యింట్లోనే ఉండ నీయండి — అంటే వినలేదు సార్! వీళ్లకో పిచ్చి నమ్మకం డాక్టర్ చావుని రానీయకుండా ఉంచుతారనీ!"

"ఉమా!" గద్దిస్తూన్నట్టు అరిచేడు విశ్వం. అతను ఈ మాటల్నీ — ఈ స్థితినీ అన్వయించుకో లేకపోతున్నాడు. అతని ఎరికలో బాధ ఉన్నప్పుడు దాన్ని అరుపులతోనో, లేకపోతే మూల్గులతోనో బహిర్గతం చేసుకోవడమే ఎరుగును. కాని యిలా

**జరిగిన కథ — 7 :** డాక్టర్ రాజా ఎం. డి. లో గోల్డ్‌మెడల్ సంపాయించుకొంటాడు. ఇప్పుడు అతను తన కుటుంబాన్ని మోయవలసి వున్నది. రాజా, మంజుల ఇరువురూ ఒకరి నొకరు పరస్పరం ప్రేమించుకొంటారు. అతను ప్రాక్టీసుపెట్టి, కొంత ఆర్థికస్తోమత చిక్కిన తరువాత పెళ్లిచేసుకోవాలని నిర్ణయించుకొంటారు. డా. విశ్వం సహాయంతో ప్రాక్టీసు పెడతాడు రాజా. ఎం.బి.బి.యస్. పూర్తి కాకుండానే కొంత డబ్బు ఖర్చుపెట్టి ఆర్. ఎం. పి. డిగ్రీ తీసుకొని డిస్పెన్సరీ తెరుస్తాడు డా. రాధాకృష్ణ. అతను తన భార్య సుగుణకు కూడా ఓ. ఆర్. ఎం. పి. డిగ్రీ సంపాయించి ఆమెను తన డిస్పెన్సరీలోనే లేడీడాక్టర్‌గా వేసుకొంటాడు. డాక్టర్ విశ్వం దగ్గరకు ఓ అమ్మాయి వచ్చి, మీరు లోగడ నా భర్తకు చేసిన 'వేసక్టమీ' ఆపరేషన్ ఫెయిల్ అయిందని అతనితో చెప్పమని, ఫీజు క్రింద తన గాజులు తీసి యిస్తుండగా, విశ్వానికి అహం అడ్డురాగా బయటకు పొమ్మంటాడు. ఆమె పోతుండగా భర్త పేరు అడిగి తెలుసుకొని ఆమెకు సహాయం చేస్తాడు. డా. రాధాకృష్ణ ఎక్స్‌కాన్విలర్ సహాయంతో ఓ మందులషాపు పెట్టి, అందులో చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్న తన తమ్ములకు దొంగ సర్టిఫికేట్‌లు సంపాయించి వాళ్లను అందులో వుంచుతాడు. డా. విశ్వం నర్సింగ్‌హోం మేనేజర్ జబ్బుచేసి వెళ్లిపోతే, అతను వచ్చేవరకు ఆ సీటు డాక్టర్ రాజాకు అప్పగించుతాడు విశ్వం. అస్తవ్యస్తంగా వున్న ఆ నర్సింగ్‌హోంను చూసి, దానిని ఓ దారికి తేవాలని ప్రయత్నిస్తుంటాడు రాజా. ఆసుపత్రిలో తన పని అయిపోయింతర్వాత డా. విశ్వం నర్సింగ్‌హోంలో అతనికి అసిస్టెంట్‌గా పని చేస్తుంటాడు డా. శేఖర్.

వొళ్లంతా కాలిపోయి కూడా ఏ కొద్ది బాధకూడా లేనట్టు కనపడడం — అతను ఎరుగడు. ఇక్కడ ఏదో జరుగుతూంది. కాని ఏమి జరుగుతూందో తనకు తెలియటంలేదు. శేఖర్ కూడా అదే స్థితిలో ఉన్నాడు. అతనికి తోడుగ రాజా ఉంటే బాగుండునని అనిపించింది. నర్సుతో రాజా దగ్గరికి ఎవరినైనా పంపించమని చెప్పి తిరిగి ఉమవైపు చూసేడు.

"మీరు... డాక్టర్ శేఖర్ వాకింగ్ ఎన్సైక్లోపీడియా ఆఫ్ సర్జరీ కదూ" అంది.

తలూపేడు శేఖర్.

"నేను హౌస్ సర్జరీ చేసి ఆసుపత్రినించి వెళ్లిపోయింతరువాత మీరు అసిస్టెంటుగా చేరేరట సార్! మీరు కొంచెం ముందు చేరి ఉంటే మీ లెక్చర్స్ వినే భాగ్యం నాకు కూడా కలిగించి ఉండి ఉండేవారు. మీ స్టూడెంట్స్ మీ గురించి వొకటే పొగుడుతారు సార్" అంటూ పై పళ్లతో క్రింది పెదవిని బలంగా వొత్తి వొక్క నిముషం కళ్లు మూసుకుంది.

"సార్" అన్నాడు శేఖర్.

"నీ ఎన్సైక్లోపీడియా ఆఫ్ సర్జరీలో ఇలాంటి కేసు ఎక్కడ తగలలేదనుకుంటాను!"

"లేదు" అన్నట్టు తలూపి "ఇంకా నేను నమ్మలేకుండా ఉన్నాను సార్."

"సైన్స్ ఎక్స్ప్లెయిన్ చేయలేని కేసు ఇది. రీజన్ ఈ స్థితి అర్థం చెప్పలేదు. కాలితే నొప్పి అనేది రూల్. కాలినా నొప్పిలేకుండా ఉండడం? నాకు అర్థం కావటం లేదు శేఖర్."

ఉమ కళ్లు తెరచింది తిరిగి. "సార్ ఏంటి కేసుని ఇలా వరండాలో పెట్టి తెగ ఆలోచనలో పడిపోయేరు?"

విశ్వం తొందరపడకుండా... విశ్వం వొచ్చుకున్నవాడిలా "సిస్టర్ ఈ కేసుని ఎడ్మిట్ చేయండి."

"సార్ గదులు ఖాళీలేవు సార్."

"ఏదైనా కేసు డిస్చార్జ్ చేసేస్తేనో."

"అన్నీ మొన్ననే ఆపరేటెడ్ కేసులు సార్."

"విశ్వం తలపట్టుకున్నాడు ఎలాగా" అని.

"సార్ మీకు అబ్జక్షన్ లేకపోతే మనం థియేటర్కి తీసుకెళ్లి డ్రస్సింగ్ చేసి తర్వాత ఎక్కడ వేయాలో ఆలోచిద్దాం" అన్నాడు.

"డ్రస్సింగ్ ఎందుకు ఆయింట్మెంటు రాసి అలానే వొదిలేద్దాం. ఓపెన్ మెథడ్ ఆఫ్ ట్రీట్మెంటు ఫాలో అవుదాం" అన్నాడు విశ్వం.

"మనం ఓపెన్ మెథడ్ ఫాలో అవుదాం అంటే దానికి సెప్సిస్ అసలు ఉండకూడదు సార్, దానికి కావలసిన వసతులు వేరేగా ఉండాలి సార్."

"సార్" అంటూ పిలిచింది ఉమ.

ఇద్దరూ ఆమెవైపు తిరిగేరు.

"ఇంకొన్ని గంటల్లో పోయేదానికి డ్రస్సింగ్ అంటూ వృథాప్రయాస పడకండి సార్! నన్ను ఏదో వొక మూలగదిలో పడేసి—సెలైనా, బ్లడ్ అంటూ నన్ను బాధించకుండా ప్రశాంతంగా వొదిలేయండి సార్" అంది.

ఆమె వెంబడి వొచ్చినవాళ్లు "సార్ ఆమె అలానే మాట్లాడుతుంది. మీరు ప్రయత్నాలు చేయండి సార్" అన్నారు.

అప్పుడే శేఖర్ "సార్! ఇది మెడికో లీగల్ కేసు. మనం ఎలా ఎడ్మిట్ చేసుకుంటాం?" అంటూ తన సందేహాన్ని వెలిబుచ్చేడు.

విశ్వం, "అవుననుకో! ఇది మిగతా కేసుల్లాంటిదయితే — నేను పట్టించుకోకపోయేవాడ్ని. ఈమె డాక్టర్. రెండోది ఈమె నా స్టూడెంట్. మూడోది ఈమెలో ఏదో మానవాతీత శక్తి ప్రవేశించినది శేఖర్. లేకపోతే ఈ బర్న్స్కి ఈమెకి హైపెడెషన్ ఇచ్చినా ఇంకా మూల్గుతూ ఉండవల్సిన కేసు. అలాంటిది నర్సింగ్హోంలో—ఈమె తప్ప అందరూ కొద్దో, గొప్పో మూల్గుతూనే ఉన్నారు. నేను జన్మలో చూడలేని — ఊహించలేని సంఘటన ఇది. ఏమైనా మన నర్సింగ్హోంలోనే ఈమె ఉంటుంది. పరిణామాల గురించి తర్వాత ఆలోచిద్దాము." అని "శేఖర్ రూం నెంబర్ వన్ కేసు బాగానే ఉంది. ఆమెకు పదిరోజులనించి నొప్పిలేదు. ఆమెని డిస్చార్జిచేసి ఆ స్థలంలో ఈమెను వేయండి."

శేఖర్ రూం నెంబరు వన్ని డిస్చార్జిచేయమని సిస్టర్కి చెప్పి "ఈమె బ్లడ్ ప్రెషర్ తీసుకుందామంటే ఎక్కడా యింత చర్మం అంటూలేదు బ్లడ్ ప్రెషర్ కఫ్ కట్టేందుకు. సూపర్ ఫీషియల్ వెయిన్స్ కూడా కాలిపోయేయి. వేనీ సెక్షన్చేసి పాలిథీన్ ట్యూబ్ పెడ్దాం సార్."

"అలానే శేఖర్" అని, "సిస్టర్ మొదట ఈమెని థియేటర్లోకి షిఫ్ట్ చేయండి" అని తనూ, శేఖర్ థియేటర్ ప్రక్కగదిలోకి వెళ్లేరు బట్టలు మార్చుకొనేందుకు.

శేఖర్ డ్రస్చేసుకుంటూండగా, విశ్వం శేఖర్తో "ఈమె హవుస్మెన్షిప్ చేస్తూంటే వర్ణాంతర వివాహం చేసుకుంది. ఆ వివాహానికి ముందు ఎంత మంచి సంబంధాలు వచ్చేయనుకున్నావు! అన్నీ గొప్ప సంబంధాలే. చాలా పెద్ద అంతస్తులో ఉన్న సంబంధాలే. అన్నీ విడిచి ఆమె చాలా మామూలు మనిషిని చేపట్టింది. అతనూ డాక్టరే అని తర్వాత తెలిసింది నాకు. పెళ్లికి నాకు కార్డు ఇచ్చింది. ఆ మనిషి—ఈమె ప్రక్కన నిలబడడానికి అయినా అర్హత లేదు. నేనే కాదు అందరూ ఆశ్చర్యపోయేరు. తర్వాత



# నర్సింగ్ హోం

తెలిసింది ఇద్దరూ చాలా సుఖంగా ఉన్నారనీ! ఎప్పుడేనా వాళ్ల సంసారాన్ని చూద్దాం అనుకున్నాను. కాని వీలేచిక్కలేదు శేఖర్'' అంటూ ఇద్దరూ బట్టలు మార్చుకుని థియేటర్‌లోనికి వచ్చేర.

అప్పటికే ఉమని థియేటర్ టేబిల్‌మీద పడుకోబెట్టేరు. ఆమె వొంటిమీదనించి బెడ్ షీట్ తొలగించబడి ఉంది. ఒళ్లంతా కాలినా, ముఖంమీద వొక్క చిన్న పొక్కులాంటిది కూడా లేదు. బెడ్‌షీట్ మెడదాకా కప్పితే బెడ్‌మీద పడుకున్న అందంలా ఆమె కనిపిస్తుంది. కొన్ని చోట్ల చర్మం ఊడిపోయి, మరికొన్నిచోట్ల రణంలా ఏర్పడి, మరికొన్నిచోట్ల నల్లగా బొగ్గులా మాడిపోయి — నరకం అంతా ఆ చిన్న శరీరంమీదే ఉన్నట్టున్న ఉమ శరీరాన్ని — దూదితో శుభ్రం చేసేందుకు చేతిని ముందుకు తెచ్చేడు విశ్వం.

''సార్! ఎందుకు సార్? ఈ వ్యర్థ ప్రయత్నం. నేను బ్రతికేది ఇంకొన్ని గంటలే అని తెలిసినా ఇంకా ఎందుకు సార్ ఇలా క్లీనింగులూ, సెలయిన్ ప్లాస్మా ఎక్కించేందుకు ప్రయత్నాలూ.''

''ఉమా! ఈ స్థితిలో కూడా నీ వెంత బాగా మాట్లాడుతున్నావ్! నీకు బాధ అంటూ లేదా'' అంటూ విస్మయంతో అడిగేడు విశ్వం.

''బాధ ఎవరికుండదు సార్! బాధలేనిది — కట్‌చేసే మీ స్కాల్‌పల్‌కి.''

''మరి అయితే ... !!!''

''ఎలా భరిస్తున్నావు అని అడుగుతున్నారు కదూ సార్? దానికి జవాబు చాలా సులభం సార్! నేను యిప్పుడు వర్తమానంలో నివసించటంలేదు. గతంలో నివసిస్తున్నాను. నా జీవితంలో వొక్కొక్క క్షణం అతి మధురంగా, అంతకంటే మధురం చేయలేనంత ఆనందంగా బ్రతికేను. నేను ఎప్పుడూ ఈ క్షణం వృథాపోయిందే అంటూ బాధపడలేదు. అంత ఆనందం ఉంది కాబట్టే నేను ఈ బాధని ప్రక్కకు నెట్టేయగలుగుతున్నాను. అది వొక్క మాటలో చెప్పాలంటే, నాది ఆనందంలో లీనం అయిన జీవితం. జీవితంలో చాలామందికి బ్రతకడం చేతకాదు సార్! అందరినీ ఎందుకు? మీ గురించి చెప్పండి సార్. మీ జీవితంలో మిమ్మల్ని పరవశింప చేసిన సంఘటన ఏది అంటూ నేను అడిగితే మీరు గంటసేపు ఆలోచించుకుంటారు. ఎందుకో తెలుసా? మీరు ఫీలింగ్స్‌లేని ఒక మర జీవితం గడుపుతున్నారు కాబట్టి. శేఖర్‌గారికి సర్జరీ పుస్తకం ఇచ్చి, లేకపోతే కాంప్లికేటెడ్ కేస్ ఇచ్చి, ప్రక్కన బాంబు వేసినా అతనికి తెలియదు. దాన్నే ఆత్మార్పణం అంటారు. శేఖర్‌గారు వొకదాన్ని గురించి జీవితాన్ని ఖర్చుపెడితే నేను మరోదాన్ని గురించి జీవితాన్ని ఖర్చుపెట్టేను. ఇలా ఎందరు ఖర్చుపెడ్తారు? మొదట మనిషికి కావలసిందేమిటో అతనికి తెలియాలి. తర్వాత దాన్ని పొందే విధం తెలియాలి. ఆ విధంలో కృషిచేయడం తపస్సులాంటిది. నా ఆనందం ఆ తపస్సు కోవకు చెందింది సార్. అందుకే నాకు బాధలేదు.''

విశ్వం చేయి ముందుకు కదలలేదు — ఆమె రణాల్ని శుభ్రం చేసేందుకు. అతను అలానే నిలుచుండిపోయేడు.

''సారీ సార్ మిమ్మల్ని బాధపెడితే, కాని నా మనస్సులో ఉంది మీకు చెప్పక తప్పలేదు. నా జీవితం ఆఖరి క్షణాల్లో మిమ్మల్ని బాధపెట్టేందుకు కాదు నేను చెప్పింది. వాకు నేను విడమర్చి చెప్పకుని నన్ను నేను యింకా బాగా అర్థంచేసుకునేందుకు'' అని, ''సార్ మీరు నా శరీరాన్ని ఏ కొద్దిగా తాకినా నాకుబాధ కలుగుతుంది. నేను ఇప్పుడు బ్రతికేది నా భర్త గురించి, అతను నాళ్లమ్మని చూసేందుకు వాళ్ల ఊరు వెళ్లేరు. ఇంట్లోంచే ట్రంకాల్ చేసాం. ఇంకో మూడు గంటల్లో వచ్చేయాలి. అప్పటిదాకా నేను బ్రతుకుతాను సార్! అతన్ని చూసి, అతని కళ్లలో నీళ్లు చూడకుండా నేను చనిపోతాను — అందుకే మీరు నాకు ఇదీ అదీ ఇచ్చి అనవసరంగా ప్రయాసపడకండి. ఇంకో సంగతి నాకు సెడేషన్ ఇవ్వకండి. నేను మెలకువగా ఉన్నంత సేపూ చావు నా దరిదాపుల్లో రాలేదు. నేను కళ్ళు మూస్తే — శాశ్వతంగా మూసేస్తాను!''

విశ్వం కదలిపోతున్నాడు. యీ మాటలకి అతని గుండె బెక్కుతూంది.

'ఉమా' అన్నాడు ఉద్వేగంతో.

'మరీ అంత చలించకండి' అని 'నాకు సెడేషన్ యివ్వనని ప్రామిస్ చేయండి సార్' అంది.

శేఖర్ విశ్వంతో 'సార్ యీమె బాధపడుతూన్నా వోర్చుకుంటూంది సార్. ఆ చెప్పలేని బాధని మనం సెడేషన్ యిచ్చి కొంచెం అయినా తగ్గించగలం. సార్ ఆమె మాటలు...'

'డాక్టర్ శేఖర్! నేను చెప్పేనుగా మీరు తపస్వి అని. మీ ఫీల్డులో మిమ్మల్ని ఏదీ కదిలించలేదు. మీకు ఏం చేయాలో బాగా తెలుసు, దానికి ఎన్ని అడ్డంకులు వొచ్చినా దాన్ని తొలగించుకుని మీ పని మీరు చేసుకుంటారు. కాని యీ కేసులో మాత్రం మీరు నన్ను మన్నించి, నేను చెప్పినట్టు చేయండి.'

శేఖర్ నోటివెంబడి మాట రాకుండానే విశ్వం 'అలానే అమ్మా' అన్నాడు.

''అయితే నన్ను యిక్కడినించి తీసికెళ్లిఏదైనా గదిలో పడేయండి. ఎవర్నీ లోనికి రానీయకండి. వచ్చిన ప్రతీ వ్యక్తీ — నా గతాన్ని నెమరువేసుకో నియ్యకుండా, బాధ నురచిపోనీయకుండా — అడ్డుపడ్తారు. వాళ్ళు నన్ను చూసి కదలిపోతే నేను వాళ్లని వోదార్చాలి. అంత బలం లేదు డాక్టర్ నాకు. నేను నా భర్త వచ్చేదాకా — బ్రతకాలి. దానికి శక్తి కావాలి డాక్టర్. నన్ను అలవనీయకండి.

'అలాగేనమ్మా' అని నర్సుతో 'బెడ్ నెం. వన్ డిస్చార్జి చేసేరా?' అంటూ అడిగేడు.

'తను వెళ్లనంది డాక్టర్! మీ ఆర్డర్స్ అని చెప్పి పంపించేటప్పటికి చాలా కష్టం అయింది.

'సరే ఉమని గదికి షిఫ్ట్‌చేసి — బట్ట వొంటికి తగలకుండా రాడ్స్ వేయండి' అంటూ వెనక్కి తిరిగేరు.

ఆ రోజంతా విశ్వం, శేఖర్ పేషంట్సును మనస్సుపెట్టి చూడలేకపోయేరు. వాళ్ల మనసును విషాదం నింపివేసింది. ప్రతీ గంటకు వెళ్లి ఉమని దూరంనించే చూసేవాళ్లు. కళ్లు మూసుకుని ప్రశాంతంగా వున్న ఉమ ముఖాన్ని చూస్తూంటే యిద్దరి గుండెలూ తరుక్కుపోతున్నట్టయేవి.

లోపలికి విజిటర్స్ ఎవరూ రాకుండా కట్టడి చేసేరు. వాళ్ల బంధువులు వచ్చి దూరంగా నిలబడి కిటికీలోంచే వొక్క నిముషం చూసేందుకు అనుమతి యిచ్చేరు.

అందరూ విశ్వాన్ని 'ఏంటండీ! మందూమాకూ లేకుండా అలా విడిచేసేరేంటి? ఎంత సీరియస్ కేసు అయినా వొక గ్లూకోజ్ సీసా అయినా యివ్వరేంటి?' అంటూ ప్రశ్నించేవాళ్లే.

వాళ్లకి వోపికగా సమాధానం యివ్వలేక 'షటప్' అంటూ అరవవలసివచ్చింది.

నాలుగు గంటలకు రాజా వచ్చేడు. శేఖర్ నించి అంతా విని ఆమె దగ్గరిగా వెళ్లి చూసేడు. అతని కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

అతనికి ఆమెలో వొక రామకృష్ణ పరమహంస, వొక రమణ మహర్షి, వొక వివేకానందుడూ, బాధల్ని జయించిన అతీతులు కనిపించేరు. తనేగాని చూడనట్టయితే — అవన్నీ కట్టుకథలు అనుకునేవాడు. కాని చూసింతరువాతో...

అయిదింటికి ఉమ భర్త నర్సింగ్‌హోంలో అడుగుపెట్టేడు. విశ్వం, రాజా, శేఖర్, అతన్ని గదిలోకి తీసికెళ్లేరు.

అతను నోరు మెదపలేదు. బిర్రబిగదీసుకు పోయేడు ఆమెని చూస్తూ. భర్త అడుగుల్ని పసికట్టిన ఉమ కళ్లు తెరచి అతన్ని తృప్తిగా చూసి — కళ్లు మూసుకుంది. అతను అలాగే అచేతనంగా పడిపోవడం ఆమె చూడలేదు.

భార్యాభర్తల శ్వాస - అనంతంలో కలిసిపోయింది.

* * *

డాక్టర్ రాధాకృష్ణ తన తమ్ముడిచేత బ్యాగ్ ఇచ్చి ఆర్.ఎం.పి.ల దగ్గరికి పంపించేడు. సాధారణంగా ఆర్.ఎం.పి.ల దగ్గరికి స్టాండెర్డు మందుల కంపెనీల వాళ్లు రారు. రాధాకృష్ణ చేసిన పనేంటంటే ఈ ఆర్.ఎం.పి.ల వాళ్ల పేర్లు లెటర్‌హెడ్సుమీద ప్రింటు చేసి, తను తయారుచేసిన మందులపేర్లు కూడా అందులో ప్రింటు చేసేసేడు. వాళ్లపని, వాళ్లు రాయదలచుకొనిన మందు కొట్టేయడమే. ఇదే కాకుండా అందరికీ వొక మంచి పెన్‌సెట్టు ప్రెజంటేషను క్రింద పంపించేడు.

వాళ్ళు అవి చూసి పొంగిపోయి ''తప్పకుండా రాస్తాం'' అన్నారు. ఆ మాట అనగానే, రాధాకృష్ణ తమ్ముడు, వాళ్లతో మీరు రాసిన ప్రతీ పదిమందుల సీసాలకు వొక సీసా ఫ్రీగా కంపెనీ యిస్తుందని వాగ్దానం చేసేడు. ఆ మాటలతో ఇంకా సంతోషించేరు కొందరు. మరి కొందరు మాత్రం మాకు ఫ్రీగా ఇస్తాననే సీసాలరీదు డబ్బు రూపంలో ఇచ్చేస్తే బాగుంటుందని అన్నారు. ''సరే'' అనక తప్పింది కాదు — రాధాకృష్ణ తమ్ముడికి.

ఇన్ని కట్టుడిట్టాలు చేసింతరువాత మందులు మహాజోరుతో వాళ్లు రాయసాగేరు. మొదటి రెండు రోజులూ, ఒక పదిసీసాల కంటే రోజుకు ఎక్కువ పోవు అనుకున్న రాధాకృష్ణకు—మందుల షాపువాళ్లు అతని వెనకబడి ఇవ్వండి, ఇవ్వండి అని మొత్తుకుంటూంటే, చాలా సంతోషం అనిపించసాగింది. వెధవ తన బీకాంప్లెక్సు టానిక్కుకూ, మాత్రలకీ ఇంత డిమాండు పెరిగిందంటే, అది తన తెలివి

# ఇంటిల్లిపాది కేశ సంరక్షణ కోసం...
# విశ్వసించదగ్గది ఈ ప్రత్యేకమైన
# ఫామిలీ షాంపూ

## పామాలివ్



పామాలివ్ షాంపూ
రెగ్యులర్ లేదా అదనపు
పోషణకోసం ఎగ్ షాంపూ




పామాలివ్ అన్ని రకాల జుట్లకోసం ప్రత్యేకంగా సూత్రీకరించబడింది. జుట్టుని బాగా శుభ్రపరిచే ఓ గొప్ప ఆధునిక షాంపూ ఇది. అయినప్పటికీ, పిల్లలకు వాడదగ్గ కోమలత్వం దీనిలో ఉంది. ఇది, జుట్టుని మృదువుగా, ఆరోగ్యంతో నిగనిగలాడేలా చేస్తుంది.

అంతేకాదు, పామాలివ్ షాంపూ కుటుంబ బడ్జెట్‌కు అనువైంది. ఎందుకంటే, ఇటువంటి షాంపూల్లో అతి పొదుపైన ధరకు దొరికేది ఇదే!

## మీ బడ్జెట్‌కు అనువైన కుటుంబ కేశ సంరక్షణ

GK&E PS 7 TL

కాకపోతే మరింకేటి ? అనుకుని, మందుల ప్యాకింగు పరిశ్రమని మరింత వృద్ధిచేసేడు. ఖాళీసీసాలు పోగుచేసేందుకు ఇద్దర్ని చేతిక్రింద వేసుకున్నాడు – మరో నలుగుర్ని ఆ సీసాలు శుభ్రం చేసేందుకు, మరొక ఇద్దరు మందును నీళ్లలో కలిపి మందుగా చేసేందుకు.

వ్యాపారం పెరుగుతూంటే, అతనికి యింకో ఆలోచన వచ్చింది. తను ముడిసరకు కొనేదానికంటే, బీకాంప్లెక్సు సాంపిలు అరకులే కొనుక్కుంటే చాలా లాభదాయకం అనిపించింది. పాత సామాన్లలో పేషంటు సగం త్రాగి చచ్చిపోయింతరువాత, వాళ్ల వాళ్లు అమ్మేసిన అరకులు పావలాకో, నలభై పైసలుకో కొని అందులో దిట్టంగా నీళ్లు కలిపి, పదింతలు చేసి తన సీసాలో నింపి తన కంపెనీ లేబులువేసి అమ్మసాగేడు. కొందరు సాంపిల్సు అమ్మే డాక్టర్లని పట్టుకుని టోకుగా వాళ్లదగ్గర నించి బీకాంప్లెక్సు కొనుక్కుని, వాన్ని ఈ నీళ్లు కలిపే పద్ధతినే అమ్మసాగేడు. అయినా తను తట్టుకోలేకపోతున్నాడు. ''ఇది కాదు పద్ధతి'', అని మందుల కంపెనీ రిప్రజెంటేటివ్సుని కొందర్ని తనలో కలుపుకొని, వాళ్లసాంపిల్సుకొని అమ్మేయడం మొదలుపెట్టేడు. అయినా సరిపోవటంలేదు – ఆర్. ఎం.పి.లూ వెర్రిపట్టేసినట్టు రాసేస్తున్నారు కాబట్టి

మందుల కంపెనీవాళ్లు గొడవపెట్టేస్తున్నారు ''డాక్టరుగారూ మీ టానిక్కులు పంపించండి'' అంటూ.

ఇలాంటి సమయంలో అతనికి యింకో ఆలోచన తట్టింది. తను యీ బీకాంప్లెక్సు బదులు ఏ ఆయుర్వేదిక్ టానిక్కో తయారుచేస్తే ! నాలుగు రూపాయలు పెడితే ఒక సీసాడు భస్మం వస్తుంది. అది అయిదు వందల సీసాల నీళ్లలో కలిపి, కొంచెం బీకాంప్లెక్సూ, కొంచెం అయిరనూ, కొంచెం మల్టీ వైటమిన్సూ వేసి, తనే స్పెషల్ టానిక్కు – నరాల బలహీనతకు తయారుచేస్తే ? యీ రాసేవాళ్లు తను ఏమి రాయమన్నా రాస్తారు. మన పేషంట్లు వెధవలకు ఏం యిచ్చినా అలానే ఎందువక్కలా ఉంటారు. వాళ్లకు కావలసింది ఏ పదిహేనో యిరవైయో యిచ్చి ఒక సీసాడు నీల్డు రంగు మందు కొనుక్కుంటే చాలు. మానసికంగా అదో తృప్తి. తన టానిక్కులో ఏం వేసినా వేయకపోయినా కొంచెం 'ఆల్కహాలు' ఎక్కువ పోస్తే చాలు. మహాబాగుంది – అంటూ సీసా తర్వాత సీసా ఖాళీ చేస్తారు. అలా అనుకుని ఆయుర్వేద టానిక్కు తయారుచేసేడు.

ఆ ఆర్ఎంపీలు రాధాకృష్ణ తమ్ముడితో 'నీవు క్రొత్త టానిక్కు చేస్తేచేసేవు. పాతది మాత్రం ఆపకు అదీ యిదీ రెండు కలిపి రాసేస్తాం' అన్నారు.

'సరే అన్నీ అవే నీళ్లు. లేబిలు మాత్రం వేరే' అని అనుకుని రాధాకృష్ణ రెండూ తయారు చేయసాగేడు.

లాభాలు బాగా అందుతున్నాయి. తన లాభంలో నాలుగోవంతు 'వాళ్లకు ప్రజంటేషన్సు క్రింద కేటాయించి ప్రతీ నెలా సూట్‌కేసులూ, చిన్న ట్రాన్సిస్టర్లూ, టేబులు ఫాన్లూ యిలాంటి పెద్ద అయిటమ్స్‌కే దిగిపోయేడు.

# నర్సింగ్ హోం

ఆర్ఎంపీ డాక్టర్లు రాధాకృష్ణ తమ్ముడితో 'ఏంటోయ్ ఎప్పుడూ యీ రెండుమందులేనా! మీ కంపెనీ యింకా ఏమయినా తయారుచేస్తే బాగుంటుంది. అవే పేర్లు రాసి రాసి బోర్ అయిపోతూంది' అన్నారు.

రాధాకృష్ణ యింకేం తయారుచేయాలా అని ఆలోచించేడు. బ్లడ్‌ప్రెషరూ, లివరు జబ్బులూ, షుగర్‌వ్యాధీ, సెక్సు వీక్‌నెస్ యివి తగ్గిచావని జబ్బులు. వీటికి జీవితాంతం మందులు వాడుతూనే ఉండాలి. అంటే ఒక్క మనిషికి ఒక్కసారి డాక్టర్లు మందు రాస్తే యిక ఆ పేషంటు చచ్చేదాకా అలా మందులు కొనుక్కుంటూనే ఉంటాడు. మనవాళ్లకి యింగ్లీషు మందులకంటె ఆయుర్వేద మందులమీదే మహా గురి. తను యీ జబ్బులకి ఆయుర్వేద మందులు తయారుచేస్తేనో !

నలుగురైదుగురు ఆయుర్వేద ప్రముఖుల్ని కలిసి, ఫార్ములా తీసుకుని పై జబ్బులకు ఆయుర్వేద మందులు తయారుచేయడం మొదలుపెట్టేడు. తర్వాత అనిపించింది అతనికి – తను బీకాంప్లెక్సు అయితే యింగ్లీషు డాక్టర్ల దగ్గరికి తీసుకెళ్లలేడు కాని యీ మందుల్నో ? ఎవరిదగ్గరికైనా తీసికెళ్లి పరిచయం చేయొచ్చు. అలా పరిచయం చేయాలంటే తన తమ్ముడు పనికిరాడు. చాలా స్మార్ట్‌గా ఉన్న యిద్దరు రిప్రజెంటేటివ్స్‌ని తను పెట్టుకోవాలి. రెండోది అందమైన పాంప్లెట్లు ప్రింటు చేయించాలి. మూడోది బ్రహ్మాండమైన ప్యాకింగ్. దాన్ని చూడగానే అందులో బూడిద ఉన్నా, యిందులో గొప్ప మందు ఉందని నమ్మించాలి. వీటికి డబ్బు ఖర్చయినా ఫరవాలేదు.

అంతే ! వాటిమీద వారం రోజులు పనిచేసి తనకు కావలసినవన్నీ సమకూర్చుకుని మార్కెట్టులోకి ప్రవేశించేడు. తన రిప్రజెంటేటివ్సు చాలా గొప్ప సేల్సుమెన్స్. వాళ్లు నీళ్లను సైతం మందని అమ్మించేయగలరు. వాళ్లని పెద్ద డిగ్రీలు ఉన్న డాక్టర్ల దగ్గరికి కాకుండా, చిన్న డిగ్రీలూ, పెద్దప్రాక్టీసు ఉండీ, మెడికల్ సైన్సు పూర్తిగా మరచిపోయి పెన్సిలిన్ పొడిచే డాక్టర్ల దగ్గరకి వెళ్లమని ఆదేశించేడు. వాళ్లు అతను చెప్పినట్టే అలాంటి డాక్టర్ల దగ్గరికే వెళ్లసాగేరు. వాళ్ల మాటలూ, వాళ్ల సాంప్లింగ్, వాళ్ల చిన్న చిన్న బహుమానాలు చూసి రాధాకృష్ణ మందులే రాయసాగేరు వాళ్లు.

ఇప్పుడు రాధాకృష్ణ బిజినెస్ పీక్‌లో ఉంది. అతని ఖర్చులుపోను నెలకు పదివేలయినా మందుల మీదని చి మిగులుతూంది.

అతని అబార్షన్స్ నిర్విఘ్నంగా సాగుతున్నాయి.

అతని ప్రాక్టీసు బాగనే ఉంది.

ఇన్ని రకాల ఆదాయం ఉన్నా యింకా అతని డబ్బు దాహం తీరడం లేదు. తను యింకా సంపాయించాలి. ఇంకేం చేయగలడు తను ?

ఒక పెథాలజీ లాబు ఓపెన్ చేస్తేనో ? తనకు యీ ఆలోచన రానందుకు మొదట తిట్టుకున్నాడు. తను మొదలుపెట్టి ఉంటే దానిమీదనించి ఎన్నో వేలు సంపాయించేవాడు యిప్పటికే. అంటే సంపాయించనిదంతా నష్టం అన్నమాట.

కాని లాబ్ ఎవరి పేరుమీద తెరుస్తాడు తన పేరుమీదే తెరిస్తేసరి. కాని డిగ్రీ తనకులేదే. డిగ్రీ అడిగేవాడు యీ కాలంలో ఎవరు ? తను బాహాటంగా ఎం.బి బి.యస్. అని బోర్డుమీదరాస్తే, ఇన్నాళ్లలో ఒక్కడూ వొచ్చి నీ డిగ్రీ చూపించు అంటూ అడిగిన పాపాన ఎవరూ పోలేదు. ప్రభుత్వం ఇలా కళ్లుమూసుకుని ఉండాలే కాని తనలాంటివాళ్లు ఎందరో శ్రీమంతులు అవుతారు. ఎవ్వరి పేరు అక్కరలేదు తన పేరే, తన డిగ్రీయే చాలు. గొడవలు అంటూవస్తే వాటిని అణచివేసేందుకు తన దగ్గర డబ్బు ఎలాగూ ఉంది. కొంచెము పలుకుబడి అంటూ ఉంది. తనపేరూ, డబ్బూనించే, తను ఇక్కడ రెండు స్కూళ్లలో ట్రస్టీ మెంబరు అయేడు. ప్రక్కనే ఉన్న శివాలయానికి కూడా ట్రస్టీ మెంబరు. రోజూ ఎవడో ఒకడువచ్చి మీరు మా కుర్రాడికి స్కూల్లో సీటు గురించి రికమెండు చేయి లనో- ఎక్కడైనా ఉద్యోగం వేయించమనో – ఏదో ఒకటి అడుగుతూంటారు. ఒకప్పుడు జేబులో డబ్బులు లేకుండా బీడీ అరువులమీద, షాపు వాడిచేత బాకీకట్టేగాని మరొక బీడీ కూడా ఇవ్వను అని అనిపించుకున్న రాధాకృష్ణ యీ రోజు స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగరెట్ తప్పితే మరింకేం తాగడు. ప్రొద్దున్న కట్టుకున్న బట్టలు సాయంత్రం వేసుకోడు. ఇస్త్రీ మడత కొంచెం సరిగాలేకపోతే చాకలిదాని ముఖంమీదే విసిరేసి రేపటినించి నేను వేరే మనిషిని ఏర్పాటు చేసుకుంటున్నాను అంటాడు. స్కాచ్ విస్కీ తప్పితే మరింకేది అతని గొంతుక దిగదు.

ఒకప్పటి చద్దికూడు దినాలు అతనికి యింకా జ్ఞాపకం ఉన్నాయి. ఒక్కోరోజు అవి కూడా లేని రోజులు యింకా బాగా జ్ఞాపకం ఉన్నాయి. తన బంధువర్గంలోని వాళ్లంతా తన తండ్రితో 'వీడు ఫిట్ ఫర్ ఎథింగ్ ఫెలో ! ఎందుకు మేపుతావ్ ? వెళ్లగొట్టేయ్ !' అన్నరోజులు కూడా ఇంకా మరచిపోలేదు. వాళ్ల ఆ మాటలూ, తను పడిన ఆ దరిద్రం యీ రెండే తనని తరిమి తరిమి డిస్పరేట్‌గా యీ పనులన్నీ చేయించేయి. ఏ దురదృష్టంవల్ల నయినాగాని తన ఐశ్వర్యం అంతా కొట్టుకుపోతే–ఆ రోజు తిరిగి బీడీలు తను తాగడు. చద్దన్నం తినడు. శుభ్రంగా స్టేట్ ఎక్స్‌ప్రెస్ ఆఖరి సిగరెట్టు వెలిగించి స్కాచ్ బదులు టిక్‌ట్వెంటీ త్రాగి కళ్లు మూసేస్తాడు. అంతేగాని గత జీవితంలో ఒక్క క్షణం బ్రతకడు.

తనకు ఎన్ని కలలున్నాయో అన్నీ తీరిపోతున్నాయి. జీవితంలో బ్రతకడం దీన్ని కాకపోతే మరిదేన్ని అంటారు.

తన స్టార్స్ చాలా బాగున్నాయి. అందుకే యిప్పుడే అన్ని రకాల మన్నూ పట్టి బంగారం చేసుకోవాలి. ఈ పిరీడ్ దాటిపోతే తను బంగారం పట్టినా మట్టిగా మారిపోవచ్చు.

తను ఒక ద్రాక్షతోట కొనేసేడు. దానిమీద వింత పొలుకు పదిహేను వేల ఆదాయం వస్తుంది. తల్లితండ్రులకు ఒక చిన్న యిల్లు, తమ్ముళ్లకు మరో చిన్న యిల్లూ కొనేసేడు. ఇప్పుడు తన గురించి ఒక పెద్ద ఆధునాతనంగా ఉన్న బంగళా

కొనుక్కుంటే చాలు. బ్యాంకిలో వొక మూడు లక్షల ఫిక్స్‌డ్ డిపాజిట్! తన మెడికల్‌షాపు యిక్కడనించి తీసేసి, సికిందరాబాదులో స్టేషన్ దగ్గర పెట్టుకుంటే చాలు. దానికి తగిన సన్నాహాలు చేస్తూనే ఉన్నాడు. అక్కడ పగిడే లక్షన్నర అవుతుంది.

యిన్ని ప్రయత్నాలు చేస్తూన్నాడు కాబట్టే తన చేయి అంత స్వేచ్ఛగా ఆడటంలేదు. ఇప్పుడు అసలు మదుపు అంటూ లేకుండా పైథాలజీ లాబ్ పెట్టాలి. ఎలా ?

రాధాకృష్ణకు మరో బ్రెయిన్ వేవ్ వొచ్చింది. తన డిస్పెన్సరీకి అరమైలు దూరంలో వొక పెద్ద గవర్నమెంటు ఆసుపత్రి ఉంది. అక్కడ బ్రహ్మాండమైన లాబ్ ఉంది. కనీసం ఆ లాబ్ తనకు తెలిసినంతవరకూ పదిలక్షల పైదే అని — అంచనా. దాన్ని తన స్వంతం చేసుకుని వాడుకుంటే!

వెంటనే డ్రస్ మార్చుకుని మోటర్‌సైకిలు మీద ఆసుపత్రి లాబ్‌కి వెళ్లి తన్ను తాను ఛీఫ్ టెక్నీషియన్‌తో పరిచయం చేసుకున్నాడు. తన బుర్రలో ఉన్న ఆలోచన చెప్పి ప్రొద్దున్న వొక గంటా సాయంత్రం వొక గంటా తన దగ్గర పనిచేయమని రెండు మూడు వేలలో వచ్చే పరికరాలు కొందామనీ, మిగిలిన సీరాలజీ అంతా యిక్కడే అతను చేయాలనీ, దానికి ప్రతిఫలంగా అతనికి జీతం కావాలంటే జీతం, లేకపోతే పార్ట్‌నర్‌షిప్ కావాలంటే దానికి, తను సిద్ధమే అని అన్నాడు రాధాకృష్ణ.

అతను సగంనించి దిగి మూడోవంతు పార్ట్‌నర్‌షిప్‌కి వొప్పుకున్నాడు. రాధాకృష్ణ రెండు రోజుల్లో లాబ్ తెరిచేద్దాం అని చెప్పి ఆ రోజు రాత్రి తిరిగి తన ఆర్ఎంపీ ఫ్రండ్సును పార్టీకి పిలిచి, అందరూ మంచి మనిషాలో ఉండగా, తన లాబ్ గురించి చెప్పేడు.

అందరూ సంతోషపడ్తూ 'కంగ్రాట్యులేషన్స్' అన్నారు.

'మీరు వొట్టి కంగ్రాట్యులేషన్స్ అంటే ఎలా ? ఏమైనా కేసులు పంపించాలిగాని' అన్నాడు.

వొకళ్లిద్దరు తలూపినా మిగతావాళ్లంతా మా క్లినుక్కులు మీ లాబ్‌కి చాలా దూరంలో ఉన్నాయండీ! అంత దూరంనించి పేషంటును మూత్రంతీసుకురమ్మంటేవాళ్లకు యిబ్బందేఅన్నారు.

రాధాకృష్ణ ఆలోచించి "మీరు పేషంటును ఇక్కడకి పంపించకండి. మీరు పరీక్ష చేయదలచుకున్నవి ఎనిమిది లోపల మీ మీ క్లినిక్కుల దగ్గరే ఉంచమనండి. నా కుర్రాణ్ణి సరిగ్గా ఎనిమిదిన్నరకు మీ దగ్గరకు పంపిస్తాను. మీరు కలెక్ట్‌చేసిన యూరిన్, మ్యూల్, బ్లడ్ సాంపిల్సు మా వాడు తీసుకొని తిరిగి రిపోర్టుమీకు సాయంత్రానికల్లా అందచేస్తాడు. మీరు పదిరూపాయలకు రెండు తీసుకుని ఎనిమిదే యివ్వండి నాకు. ఏం అంటారు?" అన్నాడు.

"సరే" అన్నారు అందరూ.

"ఎల్లుండే లాబ్ వోపెనింగ్. మీరంతా రావాలి వోపెనింగ్ సెరిమనీకి."

"నీ లాబ్ పేరేంటి ?" అన్నారు వాళ్లు.

"రాధా పేథలాజికల్ లాబరేటరీ" అని ఖాళీ అయిన గ్లాసుల్ని తిరిగి నింపేడు.

(ఇంకా వుంది)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంపదలచుకున్నవారు సంపాదకుడు. ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి—హామీపత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగానీ, యితర రచనలుగానీ తిప్పి పంపబడాలని కోరుకునేవారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కానీ—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే. వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల వాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పడ్డ "ప్రతు"లను— కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.





ఆరోగ్యంచిందే పళ్ళు, చిగుళ్ళకోసం నమ్మకంగా వాడబడేది లవంగనూనె

కొత్త

ఇదిగో

# ప్రామిస్ పళ్ళపొడి

## అనాదిగా వాడబడుతున్న లవంగనూనెతో కూర్చినది

లవంగనూనెతో కూడిన ప్రామిస్ పళ్ళపొడి మీకెలా తోడ్పడుతుందో చూడండి.

- నోటిలో దుర్వాసనను, దంతక్షయాన్ని కలిగించే క్రిములను తొలగిస్తుంది. మీ నోటిని శుభ్రంగా రూపొందిస్తుంది.
- మీ చిగుళ్ళు ఆరోగ్యం చిందించేలా చేసి అతి మెల్లగా రుద్దుతుంది.
- మీ పళ్ళను తెల్లగా తళతళలాడేలా చేస్తుంది.
- పిప్పరమెంట్ మరియు లవంగనూనె యొక్క సాటిలేని రుచి.




బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
ఆధునాతన సాధనాలు

## కొత్తది. సాటిలేనిది. లవంగనూనె గలది ప్రామిస్ పళ్ళపొడి

CHAITRA-BLS-436 TEL

# సమృద్ధమైన పంటలకు



# అనువైన ఎరువులను సమర్థవంతంగా ఉపయోగించండి






జొన్నపంటకు విజయ్ 24-24-0 ఎంతో అనువైన ఎరువు

సిఫార్సు చేసిన ఎరువుల మోతాదు

| | ఎకరానికి కిలోలలో | |
|---|---|---|
| | విజయ్ 24-24-0 | విజయ్ యూరియా |
| నీటిసాగు పంట | 50-100 | 35-60 |
| వర్షాధారపు పంట | 50 | 25 |

నీటి సాగు పంటలకు విజయ్ 24-24-0ను నేలలో 6 సెం. మీ లోతుగా వేసి అదే బాళ్ళలో 3 సెం. మీ మీదుగా విత్తనాలు పడేటట్లు వేయండి.

సిఫార్సు వేయబడిన విజయ్ యూరియాను రెండు సమపాళ్ళలో విత్తిన 45వ దినం మొదటిసారి 65వ దినం రెండవసారి వేయండి. 90 రోజులు అంతకు తక్కువ వ్యవధిలో కోతకు,వచ్చే పైర్లకు విత్తిన తర్వాత 4 వారాలకు ఒకేసారి యూరియా వేయండి. వేసిన యూరియా యింకా సమర్థవంతంగా ఉపయోగబడటానికి ప్రతి 5 కిలోల యూరియాతో ఒక కిలో వేపపిండి కలపండి.

వర్షాధారపు పంటలకు విజయ్ 24-24-0 మరియు విజయ్ యూరియాలను రెండింటిని కలిపి దుక్కిలో విత్తేటప్పుడు భూమిలో 5 సెం. మీ లోతుగాను, విత్తనానికి 5 సెం. మీ ప్రక్కగాను వేయాలి. ఈ విధంగా విత్తనాలను, ఎరువులను, రెండింటిని ఒకేసారి వేయడానికి అనువైన గొర్రులున్నాయి. ఈ ప్రత్యేకమైన గొర్రులు దొరకనప్పుడు రెండు మామూలు నాగళ్ళను కూడా ఉపయోగించవచ్చు

ఈ పంటనుగూర్చి ఇంకా వివరాలకు ఈ క్రింది కనబరిచిన విరునామాకు వ్రాయండి.

## పైర్ల సరియైన పోషణకు



## విజయ్

MFL 2530

ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, కాంతినగర్
హైదరాబాద్-500 028



# వారఫలం

## 4-9-1981 శుక్రవారం మొదలు 10-9-1981 గురువారం వరకు

మేషం : చాల మంది మిమ్మల్ని అభినందించే వారుంటారు. కొందరు మీవలన కష్టం కలిగిందను కొనేనారుంటారు. విరోధివర్గం కూడా తయారవుతున్నదని గ్రహించాలి. వ్యాపారంలో ఏవో మార్పులు విరివిగా చేయనున్నారు. స్త్రీలకు : విద్యాయోగ్యత యందు నూతనావకాశాలుంటాయి.

వృషభం : వృత్తి వ్యాపారాలు తృప్తికరంగా సాగిపోతాయి. కళాసాహిత్యరంగాలలో అనేక అవకాశాలుంటాయి. దగ్గరకు వచ్చిన వారిని కాద[illegible]కరించండి. విద్యార్థులకు ఉన్నత విద్యాభ్యాసానికి 'సీట్లు' చిక్కే అవకాశమున్నది. ఔదార్యంతో ధర్మకార్యాచరణ ముంటుంది. స్త్రీలకు : ధనాదాయమున్నది, వ్యాపారంచేసేవారికి అనుకూలత గలదు.

మిథునం : ధన సంపాదనలో మీకు అనుకూలతగలదు. అటుఇటుగా జరిగే ప్రయత్నాలు ఒక దారికిరావచ్చు. మీవృత్తిలో సర్వానుకూలత చేకూరగల వారం. వైద్యవృత్తి, 'కంట్రాక్టు' వ్యాపారంచేసే వారికి సదవకాశాలుంటాయి. కళాసాహిత్యరంగాలలో మీకు సదవకాశాలుంటాయి. స్త్రీలకు : ఆదాయంలో వృద్ధి, వృత్తిలో అభివృద్ధి గలదు.

కర్కాటకం : బుద్ధి పూర్వకంగా తప్పు చేయరు. అయినా ఏవో పొరబాట్లు రచనల్లో, కళారంగంలో వివిధ రూపాలలో అందనున్నవి. పిలిచీ పిలవకుండగనే మిత్రులో, బంధువులో ఇల్లు చేరుతారు. అధిక వ్యయాన్ని సూచించే వారమని గ్రహించాలి. అజీర్ణ వ్యాధితోనో, రక్తపుపోటుతోనో చాలమంది వయోవృద్ధులు బాధపడనున్నారు. స్త్రీలకు : శుక్రవారం వస్తుసేకరణ అవకాశం, వృత్తిలో అవకాశాలు లభించనున్నాయి.

సింహం : దైవ కార్యాచరణ, పుణ్యకార్య తత్పరత, ముఖ్యులతో సంప్రదింపులు, ఒకానొక విశిష్ట కార్యంలో అనుకూలత, వృత్తియందు అభివృద్ధి, వ్యాపారస్తులకు, క్రయవిక్రయానుకూలత, కొందరికు విందు వినోద కార్యక్రమం సంభవం. స్త్రీలకు : ఆట పాటల్లో అభినివేశమున్నవారికి లాభదాయకం.

కన్య : మీ కార్యక్రమానికి ఆటంకం రానున్నది. మీరు చేసే వ్యాపారంలో అప్పుల పాలు కానున్నారు. ఏదో నూతన వస్తు సేకరణకు తాపత్రయపడుతారు. కాని కాలం మీకు కలసి రాలేదనే గ్రహించాలి. స్త్రీలకు : అధిక విద్యకు, అర్జనకు సదవకాశాలు లభించటమేగాక క్రీడా రంగంలో కొన్ని అవకాశాలు రానున్నవి.

తుల : సంతానాన్ని గూర్చిన ఇబ్బందులుండగలవు. వారి విద్యార్జన నిమిత్తం శ్రమపడనున్నారు. గాయకులకు, కళా రంగంలో అనుభవమున్న వారికి, చిత్ర రంగానుభవం కలవారికి రంగస్థల విహారులకు, చిన్న వ్యాపారస్థులకు కొంత అనుకూలకాలమే. స్త్రీలకు : గాయకులకు, ఉన్నతోద్యోగంలోని వారికి అవకాశాలుంటాయి.

వృశ్చికం : ఇటీవల మీరు వ్యాపారం ఏదైనా ప్రారంభించే ఉన్నా, ప్రారంభింపదలచినా, భారీగా వ్యాపారం చేయదలచినా, జాయింటు వ్యాపారానికి పూనుకున్నా, మీకు లాభదాయకమనే గ్రహించండి. ఆస్తి పాస్తుల వ్యవహారాలలో అడ్డంకులను అధిగమించగలరు. స్త్రీలకు : సర్వ రంగాలలో విజయ సూచనగలదు ధనాదాయమున్నది.

ధనుస్సు: అధికాదరణ, అధికారుల మెప్పు, పెద్దల అభిమానం, ప్రారంభించిన వ్యవహారాలలో ప్రగతి, వ్యవసాయ రంగానపాటుపడటం, ప్రజ్ఞా ప్రాభవాలు భాసించుటకు అనుకూల వారమని గ్రహించండి. మీ తాలూకు బంధువులు ఏదో విషయంలో మిమ్ము వ్యతిరేకించనున్నారని గ్రహించండి. స్త్రీలకు : నూతన వస్తు సేకరణకు, నూతన విషయాలు తెలిసికొనుటకు అవకాశంగలవారం.

మకరం : రావలసిన పైకం అందుతుంది. మిత్ర, బాంధవులు ఆదుకోనున్నారు. ఒకానొక విశిష్ట వ్యవహారంలో మీకే అనుకూలత సంభవింపనున్నది. అప్పు వసూలు కావటానికి కూడా అనుకూలత గలదని గ్రహించండి. స్త్రీలకు : వ్యాపార వ్యవహారాదేవైనా ఉంటే అనుకూలత గలదు. ఉన్నత విద్యాభ్యాసానికి సదవకాశాలుంటాయి.

కుంభం : వృత్తిలో మీకు అనుకూలత గలదు. ఉత్సాహవంతులైన యువకులకు క్రీడా రంగంలో అనుకూలత చేకూరనున్నది. గ్రహించి, యత్నించండి. మేలు కలుగనున్నది. స్త్రీలకు : విద్యాయోగ్యతకు అనుకూలత, చిత్ర రంగంలో వివిధములైన అవకాశాలు, నిర్మాతలకు కార్మిక వర్గానికి సదవకాశాలుండగలవు.

మీనం: మిత్రులతో బంధువులతో పేచీలు రానున్నవి. మాటల్లో చేతల్లో వారితో మెలగే సమయంలో, ఎంత అనుకూలత, సమ్రత, ప్రదర్శిస్తే అంతమేలని గ్రహించండి. దైవ కార్యతత్పరత చేకూరనున్నది. క్రీడారంగంలో కొందరకు అనుకూలత చేకూరగలదు. స్త్రీలకు : నూతన కార్యాచరణకు అవకాశం, వివిధ విషయాలు తెలిసికోవటానికి అవకాశాలుంటాయి.

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# నాలోనేను

## దుర్గాసింగ్ ఠాకూర్



ఆ రోజు కూడ ఎప్పటిలాగానే, నా యజమాని నన్ను నడిబజార్లో నిలబెట్టాడు– అమ్మకానికి. కాస్సేపటికి ఎవరో కొందరువచ్చి నన్ను ఎగాదిగా పరీక్షించి, ఆ పైన పెదవి విరిచి వెళ్ళిపోయారు. వాళ్ళకు నేను నచ్చలేదు కాబోలు అనుకున్నాను. నా దురదృష్టానికి నేను బాధపడ్డాను నా తోటి వారంతా అప్పు డొకరూ అప్పుడొకరూ అమ్ముడుపోయారు. చివరికి నేను మాత్రం మిగిలిపోయాను. మొదట్లో నేను కూడ ఎవరికో ఒకరికి అమ్ముడుపోతానని ఆశపడ్డాను, అటువంటి వారి కొరకు ఎదురు చూశాను ఆశతో. కాని రోజులు గడిచేకొద్దీ నాలో నిరుత్సాహం చోటు చేసుకుంది. నన్ను కొనేవాళ్ళు కనిపించ లేదు. బాధ పడటం అలవాటైపోయింది నాకు.

మరి కాస్సేపటికి, ఆపద్బాంధవుడిలా ఒక యువకుడు నా దగ్గరకు వచ్చాడు నా వైపు ఎగాదిగా చూసి ఏమనుకున్నాడో ఏమో, నా యజమాని దగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు కాస్సేపటిదాకా వాళ్ళిద్దరి మధ్యా ఏవేవో మాటలు నడిచాయి అవి నాకు వినిపించలేదు. కాని వాళ్ళ ముఖాలో నవ్వును మాత్రం గమనించగలిగను. ఆ యువకుడు కొన్ని రూపాయల నోట్లు తీసి నా యజమాని చేతిలో వుంచాడు 'అంటే బేరం కుదిరిందన్నమాట! నేనా యువకునికి నచ్చానన్న మాట!' నాకు ఆశ్చర్యంతోపాటు, ఆనందం కూడా కలిగింది నాకు అక్కడినుండి విముక్తి కలిగించినందుకు, ఆ పడుచువానికి నాలోనేను కృతజ్ఞత తెలుపుకున్నాను.

ఆ యువకుడు ఓ రిక్షా మాట్లాడి అందులో నన్ను కూర్చోపెట్టి, ప్రక్కన తనూ కూర్చున్నాడు అతని వైపు వోసారి చూశాను మరీ అంత అందగాడు కాదు, కాని ఫరవా లేదు నలుపురంగు, ఆరోగ్యమైన శరీరం. కండలు తీరి నిగ నిగ లాడుతున్నాడు వాలకం చూస్తే ఏమంత డబ్బుగల వాడిలా కనిపించ డంలేదు. 'ఏం వుద్యోగం వెలగబెడు తున్నాడో?'... అలా నా ఆలోచనల్లో నేను వుండగా, రిక్షా వో యింటి ముందుకు వెళ్ళి ఆగింది.

ఆ యువకుడు రిక్షాదిగి యింటి తాళం తీశాడు. రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేసి, నన్ను యింట్లోకి తీసికెళ్ళాడు ఇంట్లో అతను తప్ప మరెవ్వరూ లేనట్టుంది. యిల్లు చాలా చిన్నదిగా వున్నట్టు గ్రహించాను. ఇంతలో ఏమైనట్టుండి ఆ యువకునికి ఏదో గుర్తుకు వచ్చినట్టుండి హడావిడి పడిపోతూ, నన్ను గదిలోనే వుంచి, బయట తాళం పెట్టి వెళ్ళిపోయాడు. గదంతా చీకటైపోయింది. అలా చీకట్లో ఎన్ని రోజులు పడివున్నానో నాకు తెలియదు

వోరోజున నేనున్న గది తలుపులు తెరుచు కున్నాయ్ వెలుతుర్ని చూశాను నేను. ఆ వెలుతురులో, ఆ యువకుడు టిప్‌టాప్‌గా తెల్లటి దుస్తుల్లో మెరిసిపోతూ కనిపించాడు. ఆ తర్వాత అతని వెనక యిద్దరు ఆడవాళ్ళు కనిపించారు. 'ఎక్కడ్నుండి వూడి పడ్డారో వీరంతా?' అనుకున్నాను. పదీ పదిహేను నిమిషాలు గడిచాక తెలిసింది– పడుచుపిల్ల

అతని భార్యామణి, ముసలావిడ అతని తల్లి అనిన్నీ

ఆ ముసలావిడ నాకు దగ్గరగా వచ్చి, నన్ను పరీక్షగా చూసింది. ఆ తర్వాత 'ఒరేయ్ బుచ్చిబాబూ!' అంటూ ప్రక్క గదిలో వున్న కొడుకు దగ్గరకు వెళ్ళి చిరు బురు లాడింది; నన్ను తెచ్చినందుకు. ఇంకా ఏదేదో వాగుతూనే వుంది.

చూసి చూసి "ఇక వూరుకోవే అమ్మా! నాకు నచ్చింది - తెచ్చాను. మధ్య నీకెందుకు?" అన్నాడు బుచ్చిబాబు.

దాంతో ముసలావిడ నోటికి తాళం పడింది.

బుచ్చిబాబుగారి భార్యామణి నుట్టుకు వులకటంలేదు పలకటంలేదు. అంతా వింటూ చూస్తూ వుంది. 'కొత్తగా కాపరానికి వచ్చింది కాబోలు అందుకే అలా వుంది మూంగిలా' అనుకున్నాను.

ఆ రోజు రాత్రి, భార్యాభర్తలిద్దరూ గది తలుపులు బిగించి నా దగ్గరకు చేరారు.

"నువ్వు ఎంత అందంగా వున్నావో తెలుసా సుబ్బీ!" అన్నాడు బుచ్చిబాబు ప్రేమగా, భార్యను సమీపిస్తూ.

'సుబ్బి' అట సుబ్బి ... అదేం పేరు సబ్బులా... అంతకంటే మంచిపేరు దొరక లేదా ఏంటి?' అనుకున్నాను, నాలో నేను.

సుబ్బి సిగ్గుతో తల వంచేసుకొని ముసిముసిగా నవ్వుకుంది.

"అంత సిగ్గెందుకు... ఎవరున్నారని?... మరేమో నీ చెవిలో ఒక మాట చెప్పనా" అంటూ సుబ్బిని దగ్గరగా తీసుకుని ఏదో వినపడీ వినపడనట్టు ఆమె చెవిలో చెప్ప బోయి, ఖంగారులో చెవి కొరికేశాడు బుచ్చిబాబు.

'అబ్బ నా చెవి!" అంటూ అరిచింది సుబ్బి, చెవిని పట్టుకుంటూ. బాధ కలిగింది కాబోలు.

"గట్టిగా అరవకు అమ్మ లేచివస్తుంది. నీ చెవికి ఏంకాలేదులే" అంటూ సుబ్బి నోరు నొక్కేశాడు బుచ్చిబాబు.

వారి ముసి ముసి నవ్వులూ, ముద్దు ముచ్చట్లూ, అవీ యివీ అన్నీ నేను చూస్తు న్నట్టు వారికి తెలియదు. కాసేపటికి నా ఒళ్ళంతా బరువెక్కిపోయింది. ఎలాగో వోర్చు కున్నాను. అంతా ఏదో కొత్తగా తోచింది నాకు.

ఆ మర్నాటి రాత్రి కూడ ఇంచుమించు ఇటువంటి తతంగమే జరిగింది. రాను రాను వాటికి అలవాటు పడ్డాను.

తను వచ్చి అప్పుడే రెండు నెలలు అయిం దట. ఇంటిదగ్గర ఎవరెవరో గుర్తుకు వస్తున్నారట, వెళ్ళి ఒకసారి చూసి వస్తా దట—అలా అని ఆ ముసలావిడ బుచ్చిబాబుతో అంటూంటే విన్నాను. బుచ్చిబాబు "పోదువు గాని లే. అప్పుడే ఏం తొందరవచ్చింది" అన్నాడు.

ఉన్నట్టుండి వో రోజున అస్వెంతపని చేసింది ముసలావిడ. మూటా ముల్లె సర్దు



# నా లో నే ను

కి॥ చక్కాబయలుదేరి వెళ్ళిపోయింది. బుచ్చిబాబు, సుబ్బి యింకొన్నాళ్ళు వుండమని ఎంత చెప్పినా వినిపించుకోలేదు. 'పోతేపోనీ! పీడ విరగడైయ్యింది!' అనుకున్నాను నేను. అప్పుడప్పుడు నన్నుచూసి రుసరుసలాడేదావిడ నేనంటే ఆమెకు గిట్టేది కాదు.

కొన్నాళ్ళు గడిచేసరికి ఓ శుభవార్త విన్నాను, సుబ్బి ఇప్పుడు ఒట్టిమనిషి కాదట మూడోనెల తప్పిందట. బుచ్చిబాబుతో సిగ్గుపడిపోతూ సుబ్బి చెబుతుంటే విన్నాను. బుచ్చీ జూనియర్ లేక సుబ్బి జూనియర్ రాబోతున్నారట.

ఈ విషయం విన్నప్పటి నుంచీ సుబ్బిని మరీ గారాబంగా చూసుకుంటున్నాడు బుచ్చిబాబు ఇంట్లోవున్నప్పుడు అన్నిపనులూ తనే చూసుకుంటున్నాడు అమ్మకు ఈ శుభవార్త తెలుపుతూ వెంటనే బయలు దేరి రావలసిందంటూ వుత్తరం రాసేడట

ఒక రోజున బుచ్చిబాబు యింట్లో లేనప్పుడు వో పెద్దమనిషి వచ్చాడు "బుచ్చిబాబు యింట్లో వున్నాడా" అంటూ.

అతడు చూడ్డానికి లావుగా నల్లగా వున్నాడు.

"లేరండి. ఇప్పుడే భోంచేసి కంపెనీకి వెళ్ళారు" జవాబిచ్చింది సుబ్బి.

"అలాగా. వున్నాడేమోనని వచ్చాను" అని కాస్త ఆగి మళ్ళీ "కాస్త మంచినీళ్ళు ఇస్తారా, దాహంగా వుంది... బయట ఎండ మాడ్చేస్తోంది" అడిగాడు పెద్దమనిషి.

సుబ్బి ముందు సంకోచించినా, ఆ తర్వాత నీళ్ళు తెచ్చి యిచ్చింది అతను నీళ్ళు త్రాగి వెళ్ళిపోయాడు. ఆ పెద్దమనిషి ప్రయివేట్ కంపెనీలోనే 'హెడ్ మోటార్ మెకానిక్'గా బుచ్చిబాబు పనిచేస్తున్నాడట. ఆ పెద్దమనిషి చాలా మంచివాడట. ఈ విషయం మాటల సందర్భంలో బుచ్చిబాబు, సుబ్బితో చెబుతూంటె నాకు తెలిసింది. ఆ మధ్య ఒకటి రెండుసార్లు యింటికి వచ్చి బుచ్చిబాబుతో ఏదేదో మాట్లాడి వెళ్ళాడు ఆ పెద్దమనిషి. అలా వచ్చినప్పుడు మర్యాదకోసం కాఫీ చేసి ఇచ్చేది సుబ్బి వాళ్ళిద్దరికీ.

ఆ పెద్దమనిషి ప్రవర్తన నాకు నచ్చ లేదు. బుచ్చిబాబుతో మాట్లాడుతూ మాట్లాడుతూనే గదంతా పరికించేవాడు సుబ్బి వైపు అదోలా చూసేవాడు అతని వాలకం చూస్తూంటే ఏమంత మంచివాడిలా కనిపించలేదు నాకు. నాకేదో అనుమానంగానే వుంది ఆ పెద్దమనిషి మీద.

* * *

ఒక రోజున- బుచ్చిబాబు కంపెనీనుండి, వెళ్ళిన కాస్సేపటికే తిరిగి వచ్చేశాడు వచ్చీ రావటంతోటే "సుబ్బీ! అర్జంటు పనిమీద బెజవాడ వెడుతున్నాను రాత్రి పది గంటల కల్లా వచ్చేస్తాను... నువేం కంగారు పడకు" అని చెప్పి బస్సుకి టైమయిపోతున్నట్టూ కంగారుగా వెళిపోయాడు. సుబ్బి ఏదో చెప్పబోతున్నా వినిపించుకోలేదు.

పక్కింటి గోడగడియారం పది గంటలు కొట్టింది. 'అంటే రాత్రి పదయిందన్న మాట!' అనుకున్నాను నేను. బుచ్చిబాబు యింకా ఇంటికి రాలేదు. అప్పటివరకూ గుమ్మం దగ్గర నిలబడి బుచ్చిబాబు కొరకు ఎదురుచూస్తున్న సుబ్బి తలుపు గడియవేసి లోపలికి వచ్చి కూర్చుంది.

కాస్సేపటికి ఎవరో తలుపు కొట్టినట్టు చప్పుడయితే, తన బుచ్చిబాబు వచ్చి వుంటాడని వెళ్ళి తలుపు తీసింది కాని వచ్చింది లావుపాటి నల్లటి పెద మనిషి.

"ఆయన ఇంట్లో లేరండి బెజవాడ వెళ్ళారు పని మీద ... ఈ పాటికి వచ్చేస్తూ వుంటారు" అంది సుబ్బి కాస్త కంగారు పడుతూ.

"ఆ విషయం నాకు తెలుసు. నేనేగా అతన్ని పంపింది" అన్నాడు తన చేతిలో కాలుతున్న సిగరెట్టును ఆఖరిసారిగా పీల్చి పారేస్తూ. తిరిగి అతనే "బుచ్చిబాబు ఈ రాత్రికి రాడు. తను వెళ్ళిన పని పూర్తి కాలేదట, రేపు వస్తానని మరో మనిషితో నాకు కబురు పంపేడు. ఈ విషయం నీతో కూడ చెప్పమన్నాడట. అందుకే చెప్పిపోదామని వచ్చాను" అన్నాడు సుబ్బి వైపు అదోలా చూస్తూ.

బుచ్చిబాబు ఈ రాత్రికి రాడనేసరికి బిక్క మొహం పెట్టింది సుబ్బి

"దాహంగా వుంది. కాస్త మంచినీళ్ళు ఇస్తావా?" అడిగాడు పెద్దమనిషి. బాగా త్రాగివచ్చినట్టుంది, తూలుతున్నాడు.

# రెండు నిమిషాలు వోపికబట్టి ఈ కూపను పూర్తిచేయండి

NAME ______________________

ADDRESS ABROAD ______________________

______________________

SENDER'S NAME AND ADDRESS ______________________

______________________

# ఇది విదేశాలలో ఉన్న మీ మిత్రునికిగాని బంధువుకిగాని జీవితాంతం సుఖసంతోషాల నివ్వగలదు

అతడికోసం ప్రత్యేకంగా రూపొందించిన ఒక పొదుపు పథకం గురించి తెలుప గోరుతున్నాము. అదే సౌత్ ఇండియన్ బ్యాంకు ప్రవేశపెట్టిన నాన్‌రెసిడెంటు (విదేశీ) అకౌంటు. అతడు కష్టపడి పని చేసి సంపాదించుకొనే డబ్బును పొదుపు చేసుకొనటానికి ఉపయోగపడే పథకం ఇది. ఎప్పుడైనా అవసరమైనప్పుడు, ఎక్కడైనా యథేచ్ఛగా తిరిగి తీసుకొనటానికి వీలైన అకౌంటు ఈ పథకం క్రింద దాచుకొన్న డబ్బుకి ప్రత్యేకమైన రేటున వడ్డీ లభిస్తుంది

ఇంతకుముందెప్పుడూ లేని ప్రయోజనాలు :

- అమెరికన్ డాలర్లలోగానీ, పౌండు స్టెర్లింగులలోగానీ అకౌంటు పెట్టుకోవచ్చు. రూపాయలలో కావాలంటే - ఎప్పటికప్పుడున్న విదేశీమారకపు రేటున మార్చుకొనవచ్చు.
- దీనిపై వచ్చే వడ్డీకి అదాయపు పన్ను ఉండదు
- డిపాజిట్ చేసిన మొత్తంపై సంపద పన్ను ఉండదు
- మిగిలిన డబ్బును రిజర్వుబ్యాంకు అనుమతితో నిమిత్తం లేకుండా తిరిగి విదేశీ ద్రవ్యంలోకి మార్చుకొనవచ్చు

ఇలాంటి సదవకాశాన్ని జారవిడుచుకొనకండి. మీ మిత్రునకుగానీ, బంధువుకిగాని వ్రాసి మాతో సంప్రతించమనండి. మీకు అలా వ్రాయటానికి వ్యవధి లేనట్లయితే, ఈ కూపను పూర్తిచేసి మాకు పంపండి. మిగతా పని మేమే చేసి పెడతాము




రిజిస్టర్డ్ ఆఫీసు: త్రిచూర్, కేరళ.

మీరెక్కడున్నా, మీకు తోడ్పడటానికి పెరుగుతున్న బ్యాంకు.

SIB/5 81/TEL

# నా లో నే ను

ఆ సమయంలోనే మంచినీళ్ళు తేవటానికి లోనికెళ్ళింది సుబ్బి.

పెద్దమనిషి లోపలికొచ్చి తలుపు గడియ పెట్టాడు.

నీళ్ళగ్లాసుతో తిరిగివచ్చిన సుబ్బికి ఇదంతా చూసేసరికి రానున్న ప్రమాదమేమిటో అర్థమైపోయింది గభాలున గ్లాసును కింద పడేసి, అతన్ని తప్పించుకుని బయటి తలుపు తెరవపోయింది కాని వీలుపడలేదు. ఆ పెద్ద మనిషి ఆమెకు అడ్డు వచ్చాడు "నా కోరిక తీర్చు, కావలసినంత డబ్బు ఇస్తాను".

"నేనలాంటిదాన్ని కాను. నన్ను విడిచి పెట్టు" అంటూ బతిమలాడింది సుబ్బి.

అతను వినిపించుకోలేదు. గభాలున పోయి సుబ్బిని పట్టుకొని. తన చేతులతో ఆమెనోరు మూసేశాడు సుబ్బి విడిపించుకోడానికి ఎంతో ప్రయత్నించింది. కాని లాభం లేక పోయింది.

ఆ పెద్దమనిషి ఎలాగో సుబ్బిని నాదగ్గరకు తీసుకువచ్చి నా పైకి తోశాడు. సుబ్బి దభాలున నామీద పడింది.

నా నాలుగు కాళ్ళలోని ఒకకాలు మొదటి నుంచీ సరిగా లేదు. కాస్త అటూ యిటూ వూగుతూంది సుబ్బి అలా దభేలున మీద పడేసరికి ఆ కాలు కాస్తా విరిగేటంత పనై య్యింది. ఆ పెద్దమనిషి సుబ్బిని చేతులలో బంధించబోయాడు. అతని చేతిని గట్టిగా కొరికింది సుబ్బి అతను పట్టు విడిచేశాడు. లేని బలాన్ని తెచ్చుకొని, అతన్ని తోసేసింది సుబ్బి అసలే తాగి వున్నాడేమో, ఆ తోపుకి తూలి నామీద పర్వతంలా పడ్డాడు.

ఇంకేముంది!? మరుక్షణంలోనే నా అవిటి కాలు విరిగిపోవటం, ఆ కాలులో ఆ పెద్ద మనిషి కాలు ఒకటి ఇరుక్కుపోవటం జరిగి పోయాయి. అతను బాధతో లేవటానికి ప్రయత్నించాడు, కాని లేవలేక పోయాడు. ఘోరోసారి బాధతో మూలిగాడు. సుబ్బి బయటి తలుపు తీసి పరుగెత్తింది "రక్షించండి! రక్షించండి!' అంటూ.

నా కాలు విరిగిపోయినందుకు, బుచ్చిబాబు నన్ను ఇక వుంచుకుంటాడో లేదో కాని, తన యిల్లాలిని ఆపద నుండి కాపాడినందుకు నన్ను తప్పక అభినందిస్తాడని అనుకున్నాను, ఆ సమయంలో.








# ధర్మపథం — బులుసు వేంకట రమణయ్య

## కపాలి కరుణ

కపాలి అంటే శివుడని అందరికీ తెలుసును. త్రిమూర్తులలోను అతని స్వరూపమే కొంత భయంకరమైనది. కపాలాన్నీ, సర్పాలనూ ధరించి, పులితోలు కట్టుకున్న అతని రూపం భయం కల్గించడంలో ఆశ్చర్యం లేదు. అందువల్లనే అతనికి ఉగ్రుడనీ పేరు ఉన్నది. ఆయన ఎంత భీకరుడో అంత దయాళువు. సులభంగా వరాలిస్తాడు. ఉబ్బు లింగడనే వాడుక పేరు అతనికున్నది. "ఆశుతోషి" అనిన్నీ మరొక పేరు. ఇది చాలా మంది ఎరుగరు. అంటే శీఘ్రంగా సంతోషించి వరాలిచ్చే వాడన్నమాట! అసురులు ఇతన్ని సంతోషపెట్టి కోరిన వరాలు సంపాదించేవారు.

ఒకప్పుడు మాలి, సుమాలి అనే ఇదరు రాక్షసులు శివుని గురించి తపస్సు చేసి, వరంగా నిరంతర తేజస్సును కోరారు. దాని ప్రభావంవల్ల వారు రాత్రింబగళ్ళు వెలుగుతూ ఉండేవారు. అందువల్ల వీరు తిరిగేచోట్లలో 'రాత్రి-పగలు' అనే విభాగం లేకపోయింది. ప్రకృతి నియమం దెబ్బతిన్నది. దేవతలందరూ తల్లడిల్లి పోయారు. రాత్రిందివ విభాగానికి కర్త అయిన సూర్యదేవుడు అప్పుడా రాక్షసులపై కోపించి త్రిశూలాన్ని ప్రయోగించగా వారు మూర్ఛపోయారు భక్తులకు కలిగిన ఈ ఆపదను గ్రహించి శంకరుడు వచ్చి వారికి చైతన్యాన్ని అనుగ్రహించాడు. తన భక్తులను హింసించిన సూర్యునిపై కోపించి, అతన్ని సంహరించ పూనుకొన్నాడు కూడా.

దక్షయజ్ఞంలో పళ్ళు రాలిన సూర్యుడు భయపడి బ్రహ్మలోకానికి పోయి బ్రహ్మను శరణు పొందాడు శివుడు అక్కడికి రాగా, బ్రహ్మ ఎంతో మర్యాదచేసి "మహాత్మా! నీవే జగత్తు భువు సృష్టికర్తవు నీవే! నీవు సృజించిన సూర్యుణ్ణి నీవే సంహరించడం తగునా! సూర్యుడు లేకపోతే "ఇది పగలు, ఇది రాత్రి" అనే కాల విభాగమే లేకపోతుంది. ప్రపంచం తారుమారవుతుంది. అందరికీ అనేక ఆపదలు, అనర్థాలు కలుగుతాయి. అతణ్ణి రక్షించు" అని చెప్పి సూర్యుణ్ణి రప్పించి శివుని కాళ్ళమీద పడవేశాడు. సూర్యుడు తన తప్పు క్షమించాలని ప్రార్థించాడు కరుణా తరంగితహృదయుడైన మహేశ్వరుడు అతణ్ణి అనుగ్రహించి, చిరునవ్వు నవ్వుతూ పంపివేశాడు.

శివుడు తన భక్తులను — వారు కోరకపోయినా కాపాడే ఉదార స్వభావుడు. శరణుచొచ్చిన వారి నందిరినీ అనుగ్రహించే నవనీత హృదయం అతనిది.



# 107 స్పెషల్ డిటర్జెంట్ బార్.

## ఇది యిచ్చే ఎక్కువ తెల్లదనానికి కారణం?
## దీనిలో వున్నది-'గుట్టుగా' తెల్లపరిచే పదార్థం!




107 స్పెషల్ డిటర్జెంట్ బార్ సోపులోనే వుంది. ప్రత్యేక తెల్లదనం యిచ్చే సీక్రెట్ ఏజెంటు. అధికమైన తెలుపుకీ మెరుపుకీ ఇదే కారణం.

ఒత్తుగా వచ్చే నురగలు మురికిని వదలగొడతాయి. అంతేకాదు - యీ బార్ సోపు మంచి ఆదా కూడా.

ఉత్పత్తిదారులు: ఆల్ట్రా మరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్
రాణీపేట-642403

# హైదరాబాదు నోట్‌బుక్

### శ్రీమతి రోహిణి కసూతి ప్రదర్శనం :

భారతదేశం అనాదిగా కసూతి కళకు (ఎంబ్రాయిడరీకి) మన్ననగన్నది. తరతరాలుగా భారత మహిళలు కసూతి కళలో తమ వైవిధ్యవిలాసాలను ప్రదర్శించి ఆ కళకే నూతన వైభవం చేకూర్చారు. కసూతి, బుటేదారీ పనులతో విశ్వవిఖ్యాతి గాంచిన ఢాకా చేలలు చరిత్రలో చోటుచేసుకొన్నాయి. కసూతికళ ప్రాంతీయ వైవిధ్యాలతో సరికొత్త అందాలు సంతరించుకొన్నది. తెలుగునాడు కూడ కసూతికళ, అద్దకం, శిల్పచిత్ర ఒకప్పుడు వాసికెక్కినదే. శ్రీమతి అల్లాడి రోహిణిగారి కృషివల్లంతో మరొకసారి తెలుగు మహిళలు తలెత్తి చూడడం సంభవించింది. శ్రీమతి రోహిణిగారు దాదాపు ముప్పై



సంవత్సరాల క్రితం తమ తల్లిగారివద్ద కుట్లు నేర్చుకొన్నారు. కాడకుట్లు, ముడ్డుకుట్లు, గొలుసు కుట్లు, అడ్డకుట్లు, మామూలు కుట్లు మొదలయిన పలుకుట్లు నేర్చారు. ఆమె ఆధ్యాత్మిక, చారిత్రక ఇతివృత్తాలపై మరలి, వాటిని కుట్లతో కమనీయంగా బింబించడానికి దారితీసింది. ఇలా రోజుకు ఏడెనిమిది గంటలు ఆమె పని చేయడంతో ఉత్తమ కళాఖండాలు పోగులు పోసుకొన్నాయి. "ఒక చదరపు అంగుళంకుట్టుకు అరగంట పడుతుంది. నేను ప్రస్తుతిదృశ్యాలు మున్నగు వాటికి ఇరవై ముప్పై రంగుల దారాలు వాడాను. దాదాపు 60 రకాల రంగుల దారాలు వాడగలను అని ఆమె అన్నారు. కసూతిలో ప్రపంచపు రికార్డు 30 వేల గంటలట, మరి శ్రీమతి రోహిణిగారు రోజుకు ఎనిమిది గంటల ప్రకారం కుడితే 25 సంవత్సరాలకు 72 వేల గంటల కాలమవుతుంది. ప్రపంచపు రికార్డు అధిగమించారు కదా ! మధుర కోట్స్‌వారు 1979 లో నిర్వహించిన ఆల్ ఇండియా కోట్స్—యాంకర్ ఎంబ్రాయిడరీపోటీలో శ్రీమతి రోహిణిగారు రచించిన 'గీతోపదేశం' అనే కసూతి కళాఖండానికి పదివేల రూపాయల ప్రథమబహుమతి లభించింది. ఇంతవరకు ఈమె మూడు ప్రదర్శనాలు నిర్వహించారు.

ఆగస్టు 5వ తేదీనుంచి 10 వతేదీవరకు వెల్లూరు చిత్రకళా నికేతన్‌వారి నిర్వహణలో కళాభవన్‌లో జరిగిన ప్రదర్శనం నాలుగవది. దీనిలో 26 కళాఖండాలు పెట్టారు. విఘ్నేశ్వరునితో ప్రారంభమయిన ఈ ప్రదర్శనం 'అంతిమశరణ్యం' (కపాలీశ్వర దేవాలయంతో) సమాప్తమయింది. ఈ ప్రదర్శనంలోని ప్రతి కళాఖండమూ ఒకదానిని మించి మరొకటి వైవిధ్యంతో విలసిల్లుతున్నది. "ఈ గోలకు దూరంగా" అనే గ్రామీణ ప్రశాంత వాతావరణ చిత్రంలో ఆమె పదారు రంగుల దారాలువాడారు. 'అంతిమ శరణ్యం' మానవునికి చివరికిశరణ్యమేమిటో మధుర సంకేతంగా ఉపదేశించింది. "భారత విపినరాజు" (బెబ్బులి)మన మీదికి దూకేట్టే వుంది. శ్రీరామ పట్టాభిషేకం చిత్రం తంజావూరు సంప్రదాయంలో ముచ్చటగా వుంది. ముష్యశృంగుని అయోధ్యా గమనం చిత్రం, సీతాస్వయం వరానంతరం అయోధ్యకు వూరేగింపు పాత్రల చిత్యంతో విందికగా ఉన్నాయి. భారత దేశపుకొండ, చిరుతపులి విశ్రాంతి, గుర్రాలు స్వాభావికంగా ఉంటూ, రోహిణిగారి మృగపక్షి స్వభావ పరిశీలన ప్రాశస్త్యాన్ని తెలుపుతున్నాయి. ఆత్మ్యాలకు మంచు చిత్రంలో ఆమె గుడ్డను కూడా వాడారు. బేలూరు నటరాజ హొయ్సళ కళా వైభవాన్ని కసుల గట్టిస్తున్నది. ఇలా వర్ణిస్తూ పోతే, ఎంత దూరమన్నా వెళ్లవచ్చు. రోహిణిగారి సూచీనాట్యానికి, రంగుల ఎన్నికకు, నేత లనే ప్రథమపడజేసే సీవన పాండిత్య సంపదకు, ప్రాచీన పురాణేతిహాస చరిత్ర జ్ఞానానికి ఈ ప్రదర్శనం మణి ముకురం అంటేచాలు. రోహిణిగారికి ఇలాటి పదవకాశమిచ్చిన ఆమె భర్త శ్రీ అల్లాడి వెంకటనారాయణ (న్యాయవాది, బొంబాయి)గారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. రాష్ట్ర సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఈ ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ, రోహిణిగారి హస్త కౌశలాన్ని ప్రశంసించారు.



భారత విపినరాజా

### మణిమంజరి ఆవిష్కరణ :

కవి చూడామణి, విమర్శకాగ్రేసరులు, చరిత్ర, పురాతత్త్వ పరిశోధక ప్రవరులు, యోగిపుంగవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి దివ్య స్మృతికి అంకితమైన షాణ్మాసిక పత్రిక "మణిమంజరి"ని రాష్ట్ర సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఆగస్టు 7 వ తేదీన ఆవిష్కరించారు. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగిన ఈ ఉత్సవాన్ని శ్రీనివాస సాహితీ సమితి ఏర్పాటు చేసింది. శ్రీ శాస్త్రిగారి తృతీయ పుత్రుడు డాక్టర్ వేటూరి ఆనందమూర్తి స్వాగతం చెబుతూ మణిమంజరి పత్రికద్వారా శాస్త్రిగారి రచనలు, వారిని గురించిన రచనలు ప్రచురించడం ప్రభాకర పరిశోధక మండలి లక్ష్యమని వివరించారు. సభను ప్రారంభించిన రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ డైరెక్టర్ డాక్టర్ పి. ఎస్ ఆర్ అప్పారావు షాణ్మాసిక ధాన్యం పుష్టికరము ఆరోగ్యకరము అయినట్లే ఈ పత్రిక విజ్ఞాన పుష్టిని, మానసికారోగ్యాన్ని కలిగిస్తుందన్నారు. అధ్యక్షత వహించిన శ్రీ కె. వి. భాస్కరరావు శాస్త్రి గొప్పదనాన్ని గూర్చి, డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు శాస్త్రిగారి పాండిత్య ప్రకర్షను గురించి ప్రసంగించారు. ఉచాన్య తిరుమల మణిమంజరి మూడునెలల కొకసారి వెలువడాలని కోరారు. డాక్టర్ వాసా ప్రభావతీ శాస్త్రి శ్రీ శాస్త్రిగారి పనులు కుమారులు కొనసాగించడం విశేషమని, ఎందరు తండ్రులకు ఇలాటి గౌరవం లభిస్తుంది ? అన్నారు. పత్రికను శ్రీ భాట్టం ఆవిష్కరిస్తూ, పెద్దల ప్రసంగాలతో ఉత్తేజితుడు కావడానికే వచ్చానని, పరిశోధన వల్ల సమాజానికి కొత్త విషయాలు అందాలని, శ్రీ శాస్త్రిగారు సి. వి. వి. యోగమార్గంలో చేసిన అపూర్వ కృషి తనకు తెలుసునని అంటూ, మణిమంజరి ప్రచురణకు ఐదువేల రూపాయల విరాళం ప్రకటించారు. శ్రీ భాస్కరరావు తమ మలి పలుకులలో ఆంధ్ర సంస్కృతికి భాట్టం శ్రీరామరక్ష ఉండగలదని చలోక్తి విసిరారు. శ్రీనివాస సాహితీ సమితి ఉపాధ్యక్షులు డాక్టర్ ఎస్. వి. రామారావు వందన సమర్పణతో ఉత్సవం సమాప్తమైంది.

### పోతుకూచి స్వగతాలు - గల్పికలు

శిష్మర ఆర్ట్స్ థియేటర్ ఆధ్వర్యంలో జూన్ 15 న త్యాగరాజ గానసభలో శ్రీ పోత

# జుట్టు అసలు ఎందుకు ఊడుతుందని ?




జుట్టుపైన ప్రకృతిలోని చాలా వాటి ప్రభావం పడుతుంది. మారే ఋతువులు, మార్పే వాతావరణం, ఎండ, చెమ్మ, అస్వస్థత, ఆందోళన, కుళాయి నీళ్ళలో కలిసిన క్లోరిన్ ఇవి సరే. జుట్టు వూడి, రాలి పోవడానికి వీటన్నిటి కన్నా ముఖ్యమైన కారణం, దానికి సరియైన ప్రమాణంలో పోషణ అందక పోవడం. మరి ఒత్తై చిక్కని జుట్టంటే, ఏకు బజార్లో ఎక్కువగా దొరికే కేశ సంరక్షణ కోసం వాడే నూనెలు శుద్ధమైనవి కాకపోవడం. దాంతో బాటు, ఆధునిక నాగరికత మోజులో పడి ప్రకృతి సహజమైన నూనెలపైన విముఖత పెరగటంతో యిది మరీ ఎక్కువ సమస్య అయింది.

**కొబ్బరి నూనె తర తరాల నుంచీ, అంటే మీ అమ్మగారి, వాళ్ళమ్మగారి, వాళ్ళ అమ్మమ్మ గారి అందమైన తలకట్టు, జుట్టులోని కీలకం.**


తరాలబట్టి స్త్రీలు శుద్ధమైన, తాజా కొబ్బరి నూనె వాడి బలమైన జుట్టు పెంచుకుంటూ ఆ జుట్టు ఊడిపోకుండా కాపాడుకుంటూన్నారు.

**అసలు కొబ్బరినూనె పరిశుద్ధత, తాజాదనం ఋజువు చేసుకోడానికి 3 ఉపాయాలు:**

మీరు వాడే కొబ్బరి నూనెను, పేరాచూట్ కొబ్బరి నూనెతో పోల్చి చూడటానికి తేలికైన 3 పరీక్షలని చెయ్యండి.

1. చూడండి. ఆ నూనె పారదర్శకమై అటు యిటూ కనిపించేలా ఉండాలి.
2. వాసన చూడండి. ఇది పాచి వాసన లేకుండా తాజాగా సరియైన వాసనతో ఉండాలి.
3. ఈ నూనె సరిగ్గా, ఆగకుండా, సహజంగా పారగలిగి ఉండాలి.

మరి మీ జుట్టుకు యీ పరీక్షలకి నిలవ గలిగిన శుద్ధమైన తాజాదనంగల కొబ్బరి నూనెనే రాసుకోండి.

## పేరాచూట్

కొబ్బరి నూనె—

నూనెల్లో సర్వోత్తమం, ప్రకృతి సహజత్వం, పరిశుద్ధత, తాజాదనం, వీటి సంగమం.

స్వచ్ఛంగా, తాజాగా, సువాసనతో, బలాన్నిచ్చే వాటితో నిండినది.

SIMOES/SOI/3/80A TL








# ఆవీ...ఇవీ...అన్నీ

## బాపురెడ్డి సాహితీసమాలోచనం

రచయిత: కర్రా కార్తికేయశర్మ. ప్రచురణ: వంశీ ఆర్ట్స్, న్యూ వల్లకుంట, హైదరాబాద్ 500044, 68 పేజీలు, వెల: రూ. 8.

సిల్వర్ జూబ్లీ చేసుకున్న బాపురెడ్డిగారి సాహితీ సమాలోచనం ఇది. గద్య కావ్యాలు, పద్య కావ్యాలు, గేయాలు, గేయ నాటికలు అన్నింటినీ సాకల్యంగా అవలోకించి రాసిన ప్రశంసా గ్రంథమిది.

## వ్యంగ్య వీచిక

ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ క్లబ్ విజయవాడ విభాగంవారు వెలువరించిన తొలికార్టూన్ సంకలనం ఇది. ప్రముఖ చిత్రకారుడు, కార్టూనిస్టు శ్రీ చంద్ర గీసిన ముఖచిత్రంతో వెలువడిన ఈ సంచికలో విజయవాడలోని దాదాపు అందరు కార్టూనిస్టుల వ్యంగ్య చిత్రాలు చోటు చేసుకున్నాయి. వారితో పాటు పలువురి రచనలుకూడా పాఠకులని అలరిస్తాయి అనడంలో అతిశయోక్తి లేదు. వెల రెండు రూపాయలు. ప్రతులకు ఆం. ప్ర. క్రోక్విల్ క్లబ్ విజయవాడ విభాగం, కేరాఫ్ హాల్డా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కామర్సు, కనకదుర్గా గాకీసు ఎదురుగా, సీతారామపురం, విజయవాడ—520 004.

## విజయవాడలో సాహితీ కార్యకర్తల మహాసభలు

సాహితీ కార్యకర్తలందరినీ ఒక వేదికపై సమావేశపరిచేందుకు తెలుగు సాహితీ సంస్థల ప్రతినిధుల మహాసభలు విజయవాడలో జరగనున్నాయి.

ఈ సందర్భంగా, ఆయా సంస్థల పూర్తి వివరాలు తెలియజేయవలసిందిగా మహాసభల కన్వీనరు డాక్టర్ జి. వి. పూర్ణచందు [కార్యదర్శి, విజయసాహితి, విజయవాడ] తెలియజేస్తున్నారు.

వివరాలకు డాక్టర్ జి. వి. పూర్ణచందు, 29—36—12, మ్యూజియం రోడ్, విజయవాడ—2కు వ్రాయవచ్చు.

## అస్సాంలో అమావాస్య చీకటులు

రచన "రవిరాజు" నవభారతి వారి ప్రచురణ వెల రూపాయి పావలా. ప్రతులకి సాహిత్య నికేతన్ హైదరాబాద్—20కి రాయాలి.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna

# ప్రధానమంత్రి 20 అంశాల కార్యక్రమం లక్షలాది



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

## కష్టజీవులకు వరప్రసాదం



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం, రాష్ట్రానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి సుస్థిరమైన ప్రగతికి సంకేతం ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించి, లక్షలాది మంది బలహీన వర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింపజేసింది.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

### వాస్తవాలే ఇందుకు దర్పణం. రికార్డుస్థాయిలో ఆహారోత్పత్తి

1978-79లో రికార్డుస్థాయిలో 106 6 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేశారు. తుపాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికీ తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలు జరపడంతో 79 80లో కనీసం 70 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తి సాధించగలిగారు.

### ప్రజలకు చౌక వస్త్రాలు :

అరవై శాతం మంది చేనేత పరివారలను సహకార పరిధిలోకి తెచ్చారు.
1977-78లో 189 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేయగా 1978 79లో 2.3 లక్షల 1979-80లో 330 లక్షల చదరపు మీటర్లు చౌక వస్త్రాలను ఉత్పత్తిచేసి ఇప్పుడు 388 కేంద్రాలద్వారా ప్రజలకు పంపిణీ చేశారు.

### చౌకధర దుకాణాలద్వారా అత్యవసర సరుకులు :

ఇప్పుడు 22,009 చౌక ధర దుకాణాలద్వారా ప్రజలకు అత్యవసర సరుకులను సరఫరా చేస్తున్నారు.

### భూ సంస్కరణలు :

రాష్ట్రంలో భూ సంస్కరణలను తీవ్రతరంగా అమలు జరుపుతున్నారు. ఇందువల్ల 3.79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాధీనం చేసుకున్నారు. 1,74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు. వారిలో చాలావరకు షెడ్యూల కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల వారు ఉన్నారు.

### బలహీన వర్గాలకు ఇళ్లు :

ఈ పథకాన్ని ద్విగుణీకృతోత్సాహంతో అమలు జరుపుతున్నారు 2 5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్త వాడలలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ల స్థలాలు కేటాయించారు.

---

డైరెక్టరు సమాచార, పౌరసంబంధశాఖ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ప్రకటితము
D.I.P.R No. 25514/Advt/C1-3/81

## హైదరాబాద్ నోట్‌బుక్

కూచి సాంబశివరావు రచించిన 'స్వగతాలు—గల్పికలు'ను రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పున్నయ్య ఆవిష్కరించారు. ఈ పుస్తకంలోని కథలు కొత్త ప్రయోగాలని ఆయన అన్నారు. అధ్యక్షత వహించిన శ్రీ కె.వి.భాస్కరరావు 400 కథలు వ్రాసిన శ్రీ పోతుకూచికి కథా రచయితలలో ప్రత్యేకస్థానం ఉందన్నారు. ఈ పుస్తకాన్ని శ్రీ వి. నారాయణరావు (ఐ.ఏ.ఎస్)కు అంకితం ఇవ్వబడింది. సంస్థ కార్యదర్శి శ్రీ మద్దాళి రఘురాం స్వాగతం చెప్పారు. శ్రీమతి రమాదేవి కూచిపూడి నృత్యంతో ఉత్సవం సమాప్తమైంది.

ఉపశ్రుతి :

సంఘజీవులు ఎక్కువవుతున్నారండీ—అన్నారు డాక్టర్ రవ్వ శ్రీహరి. ప్రతి మానవుడూ సంఘజీవేకదా, అన్నాను. సంఘ జీవి అంటే ఏదో సంఘం పెట్టుకొని జీవించేవారని శ్రీహరి గారి అభిప్రాయమా?—అన్నారు పక్కన ఉన్నవారు.

— తిరుమల రామచంద్ర

## "మారణ హోమం"

నాగులు నోళ్ళు తెరచి మండూకాన్ని మింగినపుడు
శివంగులు జూళ్ళు విదిల్చి లేళ్ళ రక్తాన్ని గ్రోలినపుడు
గగనాన గ్రద్దలు పక్షుల కండరాల్ని చీలుస్తున్నపుడు
దీపభ్రమణ కీటకాలను రాకాసి బల్లులు చప్పరించినపుడు
నా హృదయాంతరాళంలో ఆశ్చర్యం, జాలి పెల్లుబికి
నా ప్రశ్న ఈ సృష్టి కర్తపై 'ఇదెక్కడి న్యాయమ'ని ?
ఇది సృష్టి రహస్యం, ఆకలిరాజ్యం,
జాతికి జాతికి మధ్య నిరంతర పోరాటం
నీకెందుకు పొమ్మన్నాడు!
విశ్వాన్ని విజ్ఞానంతో అలంకరించి
చంద్రునిపై విహార యాత్ర చేస్తూ
అణువులో పరమాణువును ఛేదించి
విత్తాన్ని సైతం జయించనున్న మానవుడు
గీతా, ఖురాన్, బైబుల్ పారమొకటేనంటూ
ఆచార,సాంప్రదాయాలను మూఢంగా నమ్ముతూ
కులం పేరిట రక్తపు కత్తులు నూరుతూ
మతం పేరిట మమతను మసి చేస్తూ
జీవితపు కాగితంపై ఎర్రమరకలు పూస్తున్నాడు !
దిగంతాలు దద్దరిల్లేలా అరచి,నే దేవుణ్ణి పిలచి
ఒక జాతి అదేజాతిని వికృతంగా అంతంచేస్తోంది
ఆకలికోసం కాదు ! మరిదేనికోసమన్న నన్ను చూసి
అస్పష్టపు హాసంతో దిక్కుల్లో లీనమయ్యాడు.

— వి ధనసాయి

## ఉత్తరాలు

[6 వ పేజీ తరువాయి]

### సీరియల్

మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక సెంటరులో ఉన్న బంగారు కొడుకు చిత్రములోని కృష్ణ, శ్రీదేవి స్టిల్ చాల బాగున్నది. క్రొత్తగా ప్రారంభము చేసిన ఎదురు చూపు సీరియల్ చదువుతుంటే మా మనసును ఎంతో ఆకట్టుకున్నది [ఆహ్లాదపరచినది] కథ ముగిసే వరకు కథకు జీవం పోయాలి [బాగుండాలి]. రచించినవారికి మా ధన్యవాదాలు. రాగజ్వాల సీరియల్ రచించిన చిట్టా రెడ్డి సూర్యకుమారిగారికి మా హృదయపూర్వక అభినందనలు.

వి. ప్రభాకరశ్రేష్టి,టి. చంద్రశేఖర్ [గురజాల]

*   *   *

31.7.81 పత్రికలో ప్రారంభించిన సీరియల్ ఎదురు చూపు చాలా బావుంది. రచయిత్రి రుక్మిణిదేవిగారికి నా హృదయపూర్వక అభివందనములు.

కె. వి. కె. దుర్గారావు [ఉసకరపిల్లి]

*   *   *

మీ [మా] ప్రియమైన అభిమాన పత్రిక ఆంధ్రసచిత్ర వారపత్రికలో ఎదురు చూపు సీరియల్ ఎంతో బాగున్నది. అది చదివిన మాకు మళ్ళీ పత్రిక ఎంత త్వరలో వస్తుందా అని ఎదురు చూస్తూ ఉన్నాము. అది రచించిన రచయిత్రికి నా ధన్యవాదములు.

ఎ. ఎస్. ప్రకాశరావు [విశాఖపట్టణం]

*   *   *

చిట్టారెడ్డి కలంనుండి వెలువడుతున్న రాగజ్వాల సీరియల్ చాలా బాగుంది. రచయిత్రిగారికి మా కృతజ్ఞతలు.

కె. సురేష్‌రెడ్డి [ఆదిలాబాదు]

*   *   *

తేది 17.7.81న ప్రారంభం అయిన పర్సింగ్ హోం మొదట్లోనే ఎంతో బాగుంది. తర్వాత తర్వాత ఇంకెంత బాగుంటుందో! పత్రిక ఎప్పుడెప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాం.

దేవుడు చూస్తూనే ఉన్నాడు చాలా బాగుంది. అంతకంటే ఏమీ చెప్పలేము.

శ్రీమతి ఎర్రగుంట రత్నగోపాల్ [సోంపేట]

### సామాన్యుని సణుగుడు

14.8.81 రావమారావు, శ్రీదేవి ముఖచిత్రం పత్రికలో సామాన్యుని సణుగుడు మధ్య తరగతి "డై" వ్యాసంలో చివరి వాక్యాలు "పూరిపాలకు పేదలకు డై" "పెంకిటిల్లు డాబాలు మధ్య తరగతి డై" అన్నవి చాలా బాగున్నాయి. ఆ పేజీలో వేసిన కార్టూనులు రెండు బాగున్నాయి.

గవర శంకరరావు (కిచ్చాడ)

కాఫీ హవుస్‌లో కాలక్షేపం
నేస్తాలతో వినోదం
చర్చించడానికో కారణం.

కావాలి నాకపుడు టోస్టెడ్
పొగాకు కమ్మదనం.

టోస్టెడ్ రుచి ఇపుడు మరింత
మృదువు. నాకలాగే ఇష్టం మరి!




ప్రపంచమంతటా లక్షలాది మంది ఆనందించే టోస్టెడ్ పొగాకు కమ్మని రుచిని మీరుకూడా ఆస్వాదించండి. ఇప్పుడు ఘాటు లేకుండా మరింత మృదువుగా చేయబడి మీ పొగ-త్రాగే ఆనందం కోసం చార్‌మినార్ ఫిల్టర్‌లో పేకవించబడింది.

చార్‌మినార్ ఫిల్టర్

CHARMINAR
FILTER

STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

ముఖ్య విక్రేత : ఎమ్ కె ట్రేడర్స్, సంగారెడ్డి

Contract-CF-4 AC-TL